సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్రవారపత్రిక
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 50
సంచిక 48
1-8-56

దుర్ముఖ ఆషాఢ బహుళ నవమి బుధవారం

# విషయానుక్రమణిక



# లోకమాన్యుని దివ్యసూక్తులు

అది బొంబాయి నగరం అక్కడి పెద్దలు ఏదో సందర్భంలో ఒక సమావేశాన్ని ఏర్పాటుచేశారు ప్రఖ్యాత పండితులు, సుప్రసిద్ధ విద్వాంసులు అనేకమంది హాజరైన ఆ సభలో తిలక్ మహాశయుడు ప్రధానోపన్యాసకుడు బాబిలోనియా నాగరికతను గురించీ, ఇరానియన్, భారతీయ సంస్కృతులకు నాగరికతకు వున్న పోలికలను గురించీ అతి గంభీరంగా ఉపన్యసించాడు. సమావేశానికి హాజరైన పెద్దలందరూ ఆ అనర్గళ ప్రసంగధోరణికీ, ఆయన పాండిత్య ప్రకర్షకు ముగ్ధులై పోయారు.

సభకు అధ్యక్షత వహించిన పార్సీ ప్రముఖుడు సమావేశానంతరం, "మహాశయా మీరు ప్రతిభను, ప్రజ్ఞా పాటవాలను రాజకీయాలలో వ్యర్థపరుస్తున్నారు మీ తెలివితేటలను చరిత్ర పరిశోధనకు ఉపయోగిస్తే ప్రపంచఖ్యాతి లభిస్తుందే, ఎందుకీ రాజకీయాలలో పడి కొట్టుకోవడం?" అని వ్యాఖ్యానించాడట.

ఇందుకు తిలక్, "భారతమాత గొడ్రాలు కాదు దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత నాలాంటి పండితులు వేలకు వేలమంది తయారవుతారు స్వరాజ్య సాధనకు కంకణధారణ చేయడమే ఈనాడు ప్రతి భారతీయుడి విద్యుక్త ధర్మం; స్వరాజ్య హోమంలో సర్వశక్తి సామర్థ్యాలను ధారపోయడమే కర్తవ్యం," అని బదులు చెప్పాడట

బాలగంగాధర్ స్వాతంత్ర్య కాంక్ష ఎంత ప్రగాఢమైనదో దీన్నిబట్టి తెలుస్తుంది.

* * *

మరొక మా జేళ్ళలో పరమ మదిసాడనగా లోకమాన్య తిలక్, మాతృదేశాన్ని పీల్చి పిప్పిచేస్తున్న బ్రిటిషు పాలకులకు హెచ్చరికగా ఒక అంతిమ సందేశాన్ని అందజేశారు. భారతభూమి భారతీయుల స్వగృహమనీ, దాన్ని బ్రిటిషువారు అక్రమంగా ఆక్రమించి తిష్ఠవేశారనీ స్పష్టపరిచాడు "ఈ ఇల్లు మాది దీని హక్కు భుక్తాలు పూర్తిగా మావే. త్వరగా ఖాళీచేసి వెళ్ళిపోతారనే ఉద్దేశంతో ఇక్కడ మిమ్మల్ని వుండనిచ్చాం. ఇప్పటివరకూ మా ఇంటి మీద పెత్తనమంతా మీరే చెలాయించారు ఇక ఆ పెత్తనం సాగనిచ్చేది లేదు. మాఇంటి మీద పెత్తనం చేసుకునే అధికారం మాదేననే విషయాన్ని మీరు నేటినుంచీ అంగీకరించక తప్పదు ఈ విషయాన్ని అంగీకరిసేనే మీతో ఏదైనా రాజీ, లేకపోతే, రాజీ అసంభవం."

క్విట్ ఇండియా ఉద్యమసందర్భంలో మహాత్ముడుకూడా ఇదేమాదిరి శంఖారావం చేసిన సంగతి గమనార్హం.

* * *

1907 లో మరొకసందర్భంలో దేశప్రజలను ఉద్దేశించి ఈవిధంగా ప్రబోధించాడు "ఒక కొద్దిమంది ఆంగ్లేయులు మన సహాయంతో మన మీదే పెత్తనంచేసి పరిపాలన సాగిస్తున్నారు పాశ్చాత్య పాలకులకు మీరు చేస్తున్న సహాయాన్ని ఆపివేయలేరా? ఈపాటి స్వార్థ త్యాగం చేయలేరా? సహాయ నిరాకరణను రాజకీయ మహాస్త్రంగా మనం ప్రయోగిస్తున్నామంటే, వారికి మనం చేస్తున్న సర్వ సహాయాన్ని నిలిపివేయాలనేకదా దాని అంతరార్థం?"

"భూమిశిస్తు వసూలుచేయడంలో వారికి మనం సహాయపడకూడదు భారతదేశ సరిహద్దులకు వెలుపల బ్రిటిషువారు సాగించే యుద్ధచర్యలలో మనం వారికి సహాయపడకూడదు భారతీయుల ధనంగాని, భారత సైనికులుగాని అలాంటి యుద్ధాలలో వారు ఉపయోగించుకునే అవకాశం ఇవ్వకూడదు. బ్రిటిషువారి న్యాయస్థానాల నిర్వహణలో కూడా మనం తోడ్పడకూడదు మన న్యాయస్థానాలను మనమే ఏర్పాటు చేసుకుందాం ఆ అదను వచ్చిందీ అనగానే విదేశీ ప్రభుత్వానికి మనం పన్నులు కట్టడం మానివేద్దాం ఈ విషయంలో మనం కలసికట్టుగా వ్యవహరించలేమా? ఈ విధంగా వ్యవహరించగలిగినట్లయితే, రేపటినుంచే మనం స్వతంత్రుల మవుతాం"

లోకమాన్యుడు ఇప్పటికి 40 సంవత్సరాల క్రితం బ్రిటిషువారిపై సాగించిన ధర్మయుద్ధంలో ఏ సూత్రాలను ప్రబోధించాడో, సరిగా వాటినే మహాత్ముడు తన మహోద్యమాలలో నైతిక సూత్రబద్ధమైన ప్రాతిపదికలుగా స్వీకరించడం జరిగింది భారతజాతీయ మహావిప్లవానికి లోకమాన్య బాలగంగాధర తిలక్ పితృసమానుడని ప్రధాని నెహ్రూ వర్ణించడం ఎంతైనా సముచితం

* * *

బాలగంగాధర తిలక్ ముస్లిం విరోధి అని దురభిప్రాయపడేవారు కొంతమంది లేకపోలేదు ఇది చాలా సత్యదూరమైన విషయం. ఆయన హృదయపూర్వకంగానే హిందూ ముస్లిం ఐక్యతను కాంక్షించాడు. జాతీయ ఐక్యతను సాధించడంలో ఎంత త్యాగం చేయడానికైనా వెనుకాడరాదని విశ్వసించాడు

1916 లో లక్నోలో మాట్లాడుతూ లోకమాన్యుడు ఇలా అన్నాడు: "ముస్లిం సోదరుల ఒత్తిడికి లొంగిపోయి వారడుగుతున్న ప్రతి విషయానికి ఒప్పుకొంటున్నామని కొందరంటున్నారు ముస్లింలు ఏవేవో అడగడం వాటికి మనం లొంగిపోవడమనే ప్రశ్న ఎక్కడ వున్నది? స్వపరిపాలనాధికారాన్ని విదేశీయులు పూర్తిగా ముస్లింలకే అప్పగించినా నేను లెక్కచేయను; అంతేకాదు ఆ అధికారాన్ని కేవలం రాజపుత్రులకే ఇచ్చినా నాకు అభ్యంతరంలేదు; ఆ మాటకు వస్తే, ఆ అధికారాన్ని హిందువులలోని దిగువ తెగలకు అప్పగించినా నేనేమీ అనుకోను అప్పటి పరిస్థితులలో సాగవలసిన ఉద్యమం మూడు పక్షాలమధ్య వుండదనే విషయాన్ని మరిచి పోకూడదు"

క్విట్ ఇండియా ఉద్యమానికి ముందు బ్రిటిష్ పాలకులు మీలోమీకు ఐక్యతలేదు. అధికారం ఎవరికి అప్పగించమంటారని వాదిస్తూవచ్చినప్పుడు "భగవంతుడికి అప్పగించినా సరే, లేదా, అరాజకశక్తులపాలు చేసినా సరే" అని మహాత్ముడు అన్న మాటలను తిలక్ ప్రవచనం గుర్తుకు తెస్తున్నది

* * *

"లోకమాన్య తిలక్ సహజ సిద్ధంగా మహాపండితుడు; అవసరంరీత్యా రాజనీతిజ్ఞుడు" అన్నాడు డాక్టర్ రాధాకృష్ణ ఒకప్పుడు మాతృదేశ దాస్య విమోచనం సాధించాలనే నిరంతర గాఢ పరితాపం తిలక్ మహాశయుడి సహజ సిద్ధమైన పాండిత్యాభిరుచులను మరుగుపరిచింది ఎడతెగని దీర్ఘ రాజకీయోద్యమాలలో నిమగ్నుడైన కారణంచేత ఆయనకు ప్రాచ్య సంస్కృతీ ప్రాభవాలనుగురించి మరీ సర్వసమగ్రమైన పరిశోధనలు చేసుకోడానికి తగిన వ్యవధి లేకపోయింది అయితే విదేశీ పాలకుల "ధర్మమా" అని కారాగార బద్ధుడైనప్పుడు మాత్రం

## ★ లోకమాన్యుని దివ్యసూక్తులు ★

ఆయనకు సారస్వత వ్యాసంగానికి మహాదవకాశం లభ్యమవుతుండేది. కారాగారాలలో గడిపిన మొత్తం పదేళ్ళ కాలంలోనే తిలక్ మహాశయుడు ఈనాటికీ ఉత్తమోత్తమమైనవని అందరూ ప్రశంసిస్తున్న గ్రంథాలను రచించగలిగాడు. 'గీతా రహస్యం' ఈ విధంగా 'మాండలే' జైలులో తయారైందే! రాజకీయ మహానాయకుడుగా ఆయన జీవితాన్ని ఎప్పటికైనా మరిచిపోతే పోతారేమో గాని, ఉత్తమ గ్రంథకర్తగా మాత్రం ఆయన పేరు ఆచంద్రతారార్కం నిలిచిఉంటుంది.

* * *

ఒకానొక సందర్భంలో ఒక మిత్రుడు, "బల్వంత రావ్ జీ! దేశం స్వతంత్రమైన తర్వాత మీరు ప్రధానామాత్య పదవిని స్వీకరిస్తారా? లేక విదేశాంగ శాఖపై ఆధ్వర్యం వహిస్తారా?", అని తిలక్ మహాశయుణ్ని ప్రశ్నించాడట.

"నాకు ఏదీ వద్దు. స్వరాజ్యం రాగానే, ఏదో ఒక జాతీయ కళాశాలలో గణిత శాస్త్ర అధ్యాపకుడుగా చేరి రాజకీయాల నుంచి విరమిస్తాను. రాజకీయాలంటే నాకు అసహ్యం వేస్తున్నది. డిఫరెనియల్ కాల్క్యులస్ మీద ఒక పుస్తకం వ్రాయాలనే అభిలాష ఇంకా పోలేదు. దేశం చాలా అధ్వాన్న స్థితిలో వుంది మీలో ఏ ఒక్కరూ దేశపురోభివృద్ధికి పనిచేయడం లేదు దాని సంగతేమిటో నైనా చూసుకోవాలి," అని తిలక్ బదులు చెప్పాడట.

దేశం బాగుపడాలంటే అన్ని రంగాలలోనూ పురోగమించడానికి ప్రయత్నించాలన్నదే తిలక్ ప్రత్యుత్తరంలోని అంతరార్థమని వేరే చెప్పవలసిన పనిలేదు.

* * *

అది బొంబాయిలో "రాష్ట్రమాత" అనే పత్రికను ప్రారంభించడానికి బ్రహ్మాండమైన ప్రయత్నాలు జరుగుతున్న సమయం. దానిలో పనిచేసే వారికి కుర్చీలకోసం, బల్లలకోసం ఇతర పరికరాలకోసం తెగ హడావుడి పడుతున్నారట. ఆ తతంగం చూస్తే తిలక్ కు చాలా ఆశ్చర్యం వేసి ఇలా అన్నాడట: "మేమూ కేసరి, మరాఠా అనే పత్రికలు స్థాపించాం గాని సంపాదక వర్గ సభ్యులకోసం ఇంత హంగామా ఏమీ చేయలేదే! ఆ పత్రికల ద్వారా మాకు ఒక దమ్మిడీ కూడా ముట్టలేదు. మా పరుపులనే చుట్టచుట్టి ముందు వేసుకుని వ్రాత బల్లలగా ఉపయోగించే వాళ్ళం. అంత మెత్తటి పరుపు చుట్టలను వత్తుగా పెట్టుకొని వ్రాసినప్పటికీ, మేము వ్రాసిన వ్యాసాలలో ఘాటుగాని, తీవ్రతగాని ఏ మాత్రం లోపించేదికాదు"

కావలసింది కార్యదీక్ష గాని లేనిపోని హడావుడి కాదని తిలక్ మాటల అంతర్యం.

* * *

1856 జూలై 23న రత్నగిరిలో జన్మించిన తిలక్ మహాశయుడు 1920 జూలై 31 అర్ధరాత్రి బొంబాయిలో పరమపదించాడు. తెల్లవారక ముందే లోకమాన్యుడి మరణ వార్త నగరమంతటా వ్యాపించి పోయింది. అత్యంత ప్రేమ పాత్రుడైన తమ నాయకుని అంతిమ దర్శనార్థం లక్షలాదిగా ప్రజలు సర్దార్ భవనం (చని పోయింది ఇక్కడే) వద్దకు రాసాగారు పూనాలోని ఆయన అనుచరవర్గమంతా ప్రత్యేక రైల్లో వచ్చి చేరారు. దహన సంస్కారం బొంబాయిలోనా, పూనాలోనా అనే మీమాంస వచ్చింది. ఆ గౌరవం బొంబాయికే దక్కాలని స్థానిక నాయకులు కోరారు; కాదు తమకే కావాలన్నారు పూనావారు. చివరకు గెలుపు బొంబాయిదే అయింది ఆగస్టు 1 (1920)న బ్రహ్మాండమైన ఊరేగింపుతో లోకమాన్యుని భౌతిక దేహాన్ని తీసుకువెళ్ళి అంత్యక్రియలు జరిపారు. మహాత్మాగాంధీ, షౌకతాలీ, డాక్టర్ కిచ్లూ ప్రభృతులు వాహకులుగా పనిచేశారు. దాదాపు మూడు లక్షలమంది బొంబాయి పౌరులు ఆ ఊరేగింపులో పాల్గొని తమ నాయకుడికి శ్రద్ధాంజలులు సమర్పించారు.

"లోకమాన్య బాలగంగాధర తిలక్ అస్తమించాడు. భారత ప్రజాబాహుళ్యంమీద ఆయనకున్నంత ఆధిపత్యం మరెవరికే లేదు. లోకమాన్యుడు ప్రజలకు ఆరాధ్యదైవమనే విషయాన్ని ఎవరూ కాదనలేరు లక్షలాది ప్రజలకు తిలక్ వాక్కు వేదవాక్కు, ఆయనమాటలు శిలాక్షరాలు. బ్రహ్మణ్య నాయకుడు, మహాపురుషుడు అస్తమించాడు ఆయన సింహగర్జనలు ఇక మనకు వినిపించవు," అన్నాడు మహాత్ముడు.

తిలక్ అస్తమించిన రోజునే మహాత్ముడు స్వాతంత్ర్యరథ సారథ్యాన్ని స్వీకరించి ఉద్యమాన్ని ప్రారంభించడం వాస్తవంగా చరిత్రాత్మకమైన సంఘటనే ★

## రాష్ట్రాల పునర్వర్గీకరణ

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుపై పార్లమెంటు ఉభయసభల పరిశీలక సంఘం అందజేసిన నివేదికను దేశీయ వ్యవహారాల శాఖమంత్రి శ్రీ గోవిందవల్లభపంత్ జూలై 16-న లోక్ సభలో ప్రతిపాదించారు. ఈ నివేదికను పార్లమెంటుకు సమర్పించడంతో రాష్ట్రాల పునర్విభజన సమస్య పరిశీలన అంతిమఘట్టంలో పడ్డదనే చెప్పవచ్చు. పార్లమెంటు ఉభయ సభలు ఆమోదించి, రాష్ట్రపతి అధికారముద్ర పడడంతో బిల్లు శాసనమవుతుంది. పరిశీలక సంఘంవారి నివేదిక సకాలంలోనే పార్లమెంటుకు అందింది కాబట్టి, మిగతా వ్యవహారమంతా నిర్ణీత కార్యక్రమం ప్రకారమే కొనసాగుతుందనీ, ఏవిధమైన విలంబనమూ లేకుండా అక్టోబరు 1 నాటికే నూతన రాష్ట్రాలు ఏర్పడుతవని భావించడానికి అవకాశం కనిపిస్తున్నది. ఢిల్లీ చర్చలలో పాల్గొని తిరిగి కర్నూలు చేరిన ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి గారు కూడా ఇదే ఆశాభావాన్ని వెల్లడించారు

పరిశీలక సంఘం అందజేసిన నివేదికలో కొన్ని కొత్త సిఫార్సులు ఉన్నప్పటికీ మొత్తంమీద అంత ప్రధానమైన మార్పులేవీ లేవనే చెప్పాలి అత్యంత వివాదాస్పదంగా పరిణమించి విపరీత అశాంతికి దారితీసిన బొంబాయినగర భవిష్యత్తు విషయంలో కూడా వీరు బిల్లులోని క్లాజును ఏవిధంగానూ మార్చలేదు అయితే జూన్ నెల ప్రారంభంలో ప్రధానమంత్రి నెహ్రూ చేసిన ప్రకటనదృష్ట్యా ఐదేళ్ళలో బొంబాయినగర భవిష్యత్తును గురించి పునఃపరిశీలన చేయవలసి ఉంటుందని మాత్రమే ఉభయసభల పరిశీలక సంఘం నివేదికలో తెలియజేసింది

దాదాపు 50 మంది వివిధ పక్షాలకు చెందిన సభ్యులు పనిచేసిన ఈ పరిశీలక సంఘం సంపూర్ణ ఏకీభావంతో నివేదికను ప్రభుత్వానికి అందజేస్తుందని భావించడానికి వీల్లేదు. వివాదగ్రస్తమైన అనేక అంశాలను కలిగివున్న ఈ బిల్లుపై సంపూర్ణ ఏకీభావం కుదరడం అసంభవమే. మొత్తం పదిమంది సభ్యులు నివేదికలోని కొన్ని కొన్ని అంశాలపట్ల తమ అనంగీకార భావాన్ని లిఖిత పూర్వకంగా వ్యక్తీకరించారు. ప్రతికూల పక్షాలకు చెందిన

# మీ క్రొత్త నాణ్యాలను గురించి తెలుసుకోనండి




ఇప్పటిలో మీరు మీడబ్బును రూపాయలు, అణాలు, పైసాలని లెక్క పెట్టుతున్నారు. మీ సౌలభ్యం కొరకనే భారత ప్రభుత్వంవారు 1957-వ సం॥ ఏప్రిల్ 1-వ తేదీ లగాయతు దశమాంశ నాణ్యాలను ప్రవేశ పెట్టాలని తీర్మానించుకున్నారు.

ఈ క్రొత్త నాణ్యపద్ధతి చొప్పున మీ రూపాయికి 100 నయా పైసాలు విలువగలదు. మొత్తం ఏడు రకాల నాణ్యాలు వాడుకలో ఉంటాయి :—

100 నయా పైసలు ... (ఒక రూపాయి)
50 నయా పైసలు ... (అర్ధ రూపాయి)
25 నయా పైసలు ... (పావు రూపాయి)
10 నయా పైసలు ... (రూపాయిలో 1/10 భాగము)
5 నయా పైసలు ... (రూపాయిలో 1/20 భాగము)
2 నయా పైసలు ... (రూపాయిలో 1/50 భాగము)
1 నయా పైసా ... (రూపాయిలో 1/100 భాగము)

## గమనింపదగిన విషయాలు

- రూపాయి చెలామణీ నాణ్యంగా వుంటుంది. దాని విలువలో లాభ నష్టములేవీ ఉండవు.
- పాత నాణ్య పద్ధతినుండి క్రొత్త పద్ధతికి మార్పు సందర్భంలో, ఈ మార్పు సావకాశంగా, క్రమక్రమంగానే జరుగుతుంది. కనీసం మూడు సం॥ వరకైనా పాత నాణ్యాలూ, క్రొత్త నాణ్యాలూ చెలామణీలో వుంటాయి.
- ఈ మూడు సం॥ కాలంలో లావాదేవీలు పాతనాణ్యాలలో నైనా, క్రొత్త నాణ్యాలలోనైనా లేక ఈ రెండు పద్ధతులలోనూ జరుగుతూ వుంటాయి



# జార్జి బెర్నార్డ్‌షా శతవార్షిక జయంతి



కలలో, కల్పనలో మునిగి తేలుతూ మురిసిపోవడం మరిగిన లోకం తీరును హర్షించలేక, మనుషుల కళ్లముందున్న రంగుటద్దాలను పగులగొట్టిన మహాద్రష్ట జార్జి బెర్నార్డ్ షా ఆత్మవంచనకు అలవాటుపడ్డ మనుషులు, అది లేనిదే కథ లేదన్న ధోరణిలో పడ్డవారు, షా ప్రబోధాలను ప్రతిఘటించబోయారు.

అహంకార మనిపించేటంత ఆత్మవిశ్వాసం గల షా ఎదురుదాడి చేసి విరుచుకపడ్డాడు. "ఋషితుల్యులను పిలిచి నిలుపుకోగల అద్భుత సుందరమైన ఈ వసుంధర ఎప్పుడు కలుగుతుంది ప్రభూ" అంటూ, ధర్మానికీ, ధర్మాత్ములకూ చోటివ్వని లోకంమీద రోషావేశంతో విరుచుకపడ్డ మహాపురుషుడు.

ఆదర్శప్రాయుడే అయినా, ఎవరికీ అనుసరణ సాధ్యుడు కాని షా శతవార్షిక జయంత్యుత్సవం జులై 26 న ప్రపంచ వ్యాప్తంగా జరిగింది.

# ★ రాష్ట్రాల పునర్వర్గీకరణ ★

సభ్యులు ఐదుగురూ, ఇద్దరు కాంగ్రెసు సభ్యులు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రలోనే చేర్చాలని వాదించారు. ఈ ఇద్దరు కాంగ్రెసు సభ్యులూ మహారాష్ట్రులే ఒకరు మహారాష్ట్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ దేవగిరికర్; రెండు. శ్రీ జి ఎస్ అల్టీకర్ ఆర్థిక, సాంఘిక తదితర కారణాల దృష్ట్యా బొంబాయి నగరాన్ని మహారాష్ట్ర నుంచి వేరుచేయడం సమర్థనీయం కాదని, నగర విలీనానికి ఐదేళ్లు గడువు పెట్టడం అనవసరమనీ వీరిద్దరూ అభిప్రాయపడ్డారు.

## ఆంధ్రప్రదేశ్

పోతే ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల విలీనం విషయమై పరిశీలక సంఘం చేసిన ముఖ్యమైన సిఫార్సులు ఈ క్రింది విధంగా వున్నవి.

ఆంధ్ర తెలంగాణాల కలయిక ద్వారా ఏర్పడే కొత్త రాష్ట్రాన్ని లోగడ బిలులో ఉదహరించినట్లు "ఆంధ్ర - తెలంగాణా" అని కాకుండా, "ఆంధ్ర ప్రదేశ్" అని వ్యవహరించాలి ఆంధ్రప్రదేశ్ అంతటా రాష్ట్ర శాసనసభకు లోక్‌సభకు ఒకేసారి ఎన్నికలు 1962 లోగాని జరగవు 1957లో ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికలు ఒక్క తెలంగాణాలో మాత్రమే జరుగుతవి 1957లో ఆంధ్ర జిల్లాలనుంచి లోక్‌సభకు మాత్రమే ప్రతినిధుల ఎన్నిక జరుగుతుంది

ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్రంలోగాని, హైదరాబాద్ రాష్ట్రంలోగాని ఎగువ శాసనసభ ఏదీ లేని కారణంచేత, కొత్తగా ఏర్పడే 'ఆంధ్రప్రదేశ్'లో ఎగువ శాసనసభను (లెజిస్లేటివ్ కౌన్సిల్) ఏర్పాటు చేసే విషయమై రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ అనంతరం చూసుకోవలసి ఉంటుంది. రాజ్యాంగం రీత్యా ఎగువ శాసనసభ నిర్మాణానికి కొత్తగా ఏర్పడే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అవసరమైన కార్యవిధానాన్ని ఉత్తరోత్తరా అనుసరించవలసి ఉంటుంది కొత్తగా రూపొందే 'మధ్య ప్రదేశ్'కు కూడా ఇదేపద్ధతి వర్తిస్తుంది. (మహారాష్ట్రకు మాత్రం 70 మంది సభ్యులతో ఎగువ శాసనసభ ఏర్పడాలని పరిశీలక సంఘం సిఫార్సు చేసింది. రాష్ట్రపతి నిర్ణయించే తేదీనుంచి ఈ శాసనసభ ఏర్పడుతుంది.)

బీదర్ జిల్లాకు సంబంధించినంతవరకు ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రప్రభుత్వాల మధ్యా, ఆదిలాబాద్, నాందేడు జిల్లాకు సంబంధించినంతవరకు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్రప్రభుత్వాలమధ్యా పరస్పరాంగీకారం ప్రకారం కొద్దిగా సరిహద్దుల సర్దుబాటు జరగాలి

## హైకోర్టు

ప్రస్తుతం గుంటూరులోవున్న ఆంధ్ర హైకోర్టును హైదరాబాదుకు మార్చాలి బిలులోని 61వ క్లాజుకు పరిశీలక సంఘం కొత్తగా చేర్చిన విపులీకరణ హైకోర్టు స్థలం మార్పును నిర్దేశిస్తున్నది ప్రస్తుతం హైదరాబాద్ హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్న న్యాయవాదులందరూ కొత్త ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రాక్టీసు చేయడానికి హక్కు కలిగి వుంటారు. గడువు తేదీ మొదలు ఒక ఏడాది లోపల వారు బొంబాయి, మైసూరు హైకోర్టులకు మారదలుచుకుంటే మారవచ్చు.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను పురస్కరించుకొని జరగవలసిన హైకోర్టుల పునర్నిర్మాణానికి సంబంధించిన రాజ్యాంగపు 9-వ సవరణబిల్లులోని భాగాలనుకూడా ఈ ఉభయసభల సంఘం పరిశీలించింది. కేరళ, మైసూరు, రాజస్థాన్ హైకోర్టు న్యాయమూర్తుల జీతాలు ఇతర హైకోర్టు న్యాయమూర్తుల జీతాలకంటే తక్కువగా వుండాలనే ప్రతిపాదన ఏవిధంగా చూసినా వాంఛనీయమైనది కాదని పరిశీలక సంఘ సభ్యులు అభిప్రాయపడ్డారు రాష్ట్రాల పునర్విభజనతో వివిధ రాష్ట్రాల ప్రతిపత్తులలోవున్న వ్యత్యాసాలే తుడిచిపెట్టుకుపోతూంటే, ఆయా ప్రదేశాలలో పనిచేసే హైకోర్టుల విషయంలో ఇలాంటి తారతమ్యాలు సృష్టించడం భావ్యంకాని మాట వాస్తవం. వచ్చే అక్టోబరునుంచీ దేశంలో రెండేరెండు రకాల రాష్ట్రాలు వుంటవి. ఒకటి "ఏ" తరగతి రాష్ట్రాలు; రెండు: కేంద్ర పరిపాలనలోవుండే భూభాగాలు (ఈ రెండో రకాన్నే 'సి' తరగతి రాష్ట్రాలని వ్యవహరిస్తారు) ఆయా హైకోర్టుల ప్రధాన న్యాయమూర్తులు గవర్నర్ల ఆమోదంతో నిర్ణయించే స్థలాలలో డివిజన్ బెంచీలు (హైకోర్టు విభాగాలు) ఏర్పాటు కావలసివుంటుందని మొదట బిలులోవున్న క్లాజును పరిశీలక సంఘం తొలగించి హైకోర్టు ప్రధాన కార్యస్థానం ఏర్పడే స్థలాన్ని రాష్ట్రపతే నిర్ణయించాలనీ, గవర్నర్‌తోనూ, ప్రధాన న్యాయమూర్తితోనూ సంప్రదించినమీదట డివిజన్ బెంచి పనిచేసే



# పువ్వు చెప్పిన కథ

**ఎందుకో తోటమాలికి తెలియదు కాని, ఆ పువ్వుకి తెలుసు.**

**అది చక్కని కథ; అతి చక్కని కథ.**

36 కోట్ల సమస్యలతో సతమతమయే వ్యక్తి జీవితంలో, — సత్సంకల్ప సదభిలాషలూ, సాధ్యాసాధ్యాలూ ముఖాముఖిని వాదించుకుంటూ, పరస్పరం నచ్చచెప్పుకోలేక నరేలే అని సర్దుకు ఊరుకునేచోట, వ్యక్తిగతమైన ఆశానిరాశలకూ నిస్పృహకూ స్థానం ఉంటుందా ?

లాలించి పాలించిన తల్లిదగ్గరనుండి, ఆలించి ఆదరించే మహిళలవరకూ, ఆయన వ్యక్తిగత జీవితంలో వెలుగిచ్చినవారి ప్రభావాన్ని పరిశీలించి, నెహ్రూను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూ అమెరికన్ రచయిత్రి ఆస్టిన్ హార్స్ట్ వ్రాసిన వ్యాసాన్ని —

---

స్థలాన్ని కూడా రాష్ట్రపతే తేల్చాలనీ సిఫార్సు చేసింది

వివిధ రాష్ట్రాలలో జరగవలసిన అభివృద్ధి కార్యకలాపాల విషయంలో రెండుమూడు రాష్ట్రాలు కలసికట్టుగా వ్యవహరించవలసి వచ్చినప్పుడు, అవసరమైన పరస్పర సంప్రతింపులకు గాను రాష్ట్రీయ సమితులు ఏర్పడాలనే ప్రతిపాదనలో అవసరమైనప్పుడు రెండు మూడు సమితులు కూడా సమావేశాలు జరుపుకోడానికి కొత్తక్లాజును చేర్చడం జరిగింది

### శాసన సభాధ్యక్షులు

కొత్త శాసనసభల అధ్యక్షులను, ఉపాధ్యక్షులను కొత్తగా ఏర్పడే తాత్కాలిక శాసనసభలసభ్యులే ఎన్నుకోవలసివుంటుంది.

కేంద్రపాలిత ప్రాంతాలపై పరిసర రాష్ట్రాల గవర్నర్లనే రాష్ట్రపతి ప్రతినిధులుగా పరిపాలనాధికార వ్యవహారాలను

(56-వ పేజీ చూడండి)

# గీర్వాణ భాషాభ్యాసం

ప్రాచీన గాథాలహరి

గతసంచిక తరువాయి

"నాలుగైదు శ్రీమద్రామాయణ శ్లోకాలకు, పది ప్రాస్తావిక శ్లోకాలకు అర్థం చెప్పినంతమాత్రాన అది గీర్వాణ పాండిత్యం అనిపించుకోదు! ఈ పరీక్షక విద్వాంసులందరు వందిమాగధుల ధోరణిలో పొగడినంతమాత్రాన ప్రభువారు గీర్వాణ విద్వాంసులు కాజాలరు! ఈ విద్వాంసులందరు పరాత్మవంచకులు! కూటసాక్షులు! శర్వవర్మామాత్యులారు మాసాల్లో తమ ప్రతిజ్ఞ నెరవేరిపోయిందని బుజాలెగరవేస్తున్నారుగాని ఆ ప్రతిజ్ఞ అవగింజలో అరభాగంకూడా నెరవేరలేదు! ఇదంతా కేవలం కపటనాటకం! వట్టి కూటసాక్ష్యం."

అని నిండు పేరోలగంలో చక్రవర్తి సమక్షంలోనే ఒక్కసారిగా అందరినీ దులిపి పెయ్యాలని గుణాఢ్యుడనుకొన్నాడు. ఆమాట లతని నోటి చివరిదాకా వచ్చాయి.

కాని దానివల్ల ప్రయోజనం ఏమి ఉంది? కొలువు కూటంలోని సదస్యులంతా ముక్తకంఠాలతో చక్రవర్తి సంస్కృత పాండిత్యం ఆకాశానికెత్తివేశారు! పరీక్షక విద్వాంసులుకూడా స్వీయధర్మం విస్మరించి కేవలం వందిమాగధులుగా మారిపోయారు!

అదీగాక మరి ఒక విషమసంధికూడా వచ్చిపడింది. మొట్టమొదట సంస్కృత పాండిత్యవిషయంలో వాదోపవాదాలు, వివాదాలు చెలరేగినప్పుడు సంస్కృతపాండిత్య పదానికి సరియైన అవధి నిర్ణయము, అర్థనిర్వచనము జరిగిఉండలేదు. ఆ సమయంలో ఆ విధంగా అర్థనిర్వచనం జరగనప్పుడా పదానికి ఎవరికి తోచిన అర్థం వారు చెప్పగోవచ్చును. అలాంటప్పుడిక పదిమందిలోను నోరు పారవేసుకొన్నంత మాత్రాన ప్రయోజనం ఏమి ఉంది?

అదీగాక ఆరుమాసాలపాటు గీర్వాణ భాషాభ్యాసం చేసిన పిమ్మట చక్రవర్తికి మాత్రం సంస్కృతపాండిత్యంలో లోటుపాటులు తెలియటలేదా? తెలిసి ఉండినా సదస్యులంతా ముక్తకంఠాలతో తమ పాండిత్యం గోరంతలు కొండంతలుగా అభివర్ణిస్తున్నప్పుడాయన తగుదునని ఆ ప్రశంసలన్నీ ఎంతో ఆప్యాయంగా అందుకున్న తరువాత ఇక వేరే ఇంకొకరిని నిందించవలసిన అవసరం మాత్రం ఏమి ఉంది? చక్రవర్తి కనుకూలంగా సదస్యులు, పరీక్షక విద్వాంసులు పక్కతాళం వెయ్యడంలోమాత్రం ఆశ్చర్యం ఏమి ఉంది! ఈ రాజాస్థానాల తీరే అంత!

ఆ విధంగా గుణాఢ్య మంత్రి హృదయంలో అనేక భావ పరంపరలు చెలరేగాయి. ఆ సమయంలోనే అతని హృదయంలో వింధ్యవాసినీదేవి పాద సన్నిధికి వెళ్ళిపోవాలనే సంకల్పం కూడా బలపడిపోయింది. అందువల్ల లోలోపల విజృంభించిన క్రోధాగ్ని జ్వాల అంతా చల్లార్చుకొని చిట్టచివరికా విధంగా ప్రసంగించాడు.

ఎంతగా తమాయించుకొన్నా అతని వాక్కుల్లో తీవ్రా అధిక్షేపము, నిశిత వ్యంగ్యము ఏమాత్రం చలారలేదు. చిట్టచివరికతని కోపాగ్ని కీల అంతా ఆ విధంగా అధిక్షేపరూపంలోనే నిప్పులు చెరిగింది. సదస్యులంతా అది గ్రహించినా గ్రహించనట్టే నటించి, విదూషకుని ప్రసంగానికంతగా నవ్వు రాకపోయినా నవ్వు వచ్చినట్టే నటించారు. చక్రవర్తి శర్వవర్మామాత్యులే ఆ విధంగా నటించినప్పుడిక ఇతరులా విధంగా నటించడంలో ఆశ్చర్యం ఏమి ఉంది?

గుణాఢ్య మహామాత్యు డానాటి రాత్రి బాగా చీకటిపడినదాకా తన భవంతికి చేరుకోలేదు. అతని ముఖవైఖరి చూడగానే నందివర్మ నిలువునా నిర్ఘాంతపోయాడు. అతని కానాటి నిండు పేరోలగంలో జరిగిన విశేషాలన్నీ కూలంకషంగా తెలిశాయి. ఆచార్యుని ప్రసంగధోరణినిబట్టి ఆయన కొంతవరకు ఆత్మనిగ్రహం అవలంబించాడనే అనుకొన్నాడు. కాని ఆయన ముఖవైఖరి చూడగానే అది కేవలం భ్రమేనని తేలిపోయింది. అయినా గుణాఢ్యుడు కొంచెం విశ్రమించేవరకు ఆ ప్రసంగం ప్రారంభించడానికి సాహసించలేదు. ప్రసంగంలోకి దిగిన తరువాత మరిక అతనికి గుణాఢ్యుని రోషధాటికి తట్టుకొనే సాహసం కలగలేదు.

"నేనిది అంతా మొట్టమొదటనే గ్రహించాను! నీవే కాదని వాదించావు! ఇప్పటికైనా నీకు తెలిసివచ్చిందా? ఈ మాయారూపకాని కంతటికీ సూత్రధారులెవరో?" అన్నాడు గుణాఢ్యుడతనివైపురిమి చూచి.

"అదే నాకవగాహన కావడంలేదు! ఈ విధంగా మిమ్మల్ని కించపరచడంవల్ల ప్రభువు వారికి ప్రత్యేకంగా ఒరిగేదేముంది? వారు మీ విషయంలో అంతగా పగబట్టవలసిన అవసరం మాత్రం ఏముంది! వారికంతగా లోతుపాతులు తెలియకపోవడంవల్లనే గీర్వాణ విద్వాంసులమైపోయామని భ్రమించారేమో!" అన్నాడు నందివర్మ కొంచెం సంకోచిస్తూ.

ఆమాట విని గుణాఢ్యుడొక్కమారుగా ఉవ్వెత్తుగా నవ్వాడు. అమాంతంగా విరగబడి నవ్వడము, అంతలోనే మండిపడిపోవడము గుణాఢ్యుని కలవాటే! కనక అంతమాత్రంచేత ఆయన హృదయం కలతదేరినదని నందివర్మకు నమ్మకం కలగలేదు.

"చక్రవర్తికేమీ భ్రమప్రమాదాలు లేవుగాని, నిన్నే ఇంకా అవి పట్టుకొని పీడించడం మానలేదు." అన్నాడు గుణాఢ్యుడింకా కొంచెం నవ్వుముఖంతోనే.

"పోనీ! అంతమాత్రంచేత మనకువచ్చిన తలవంపేమీ లేదుగదా! కొలువుకూటంలో జరిగిన కూటతంత్రం పదిమంది నోళ్లలోను పడకపోతుందా? పదిమంది విద్వాంసులకు నిజానిజాలు తెలియకపోతాయా?" అన్నాడు నందివర్మ ఎంతో ధీమాగా.

"తెలిస్తేమాత్రం?"

"చక్రవర్తికది పెద్ద అప్రతిష్ఠ కాదా?"

"ఈ ప్రతిష్ఠాననగరంలో ఇలాంటి అప్రతి

పి. గణపతిశాస్త్రి

కరమైన వ్యవహారాలెన్నెన్నో సాగాయి ....దానికేమిగాని రేపు మాఘ పౌర్ణమినాటికి మనమంతా వింధ్యవాసినీ దేవి సన్నిధికి వెళ్ళిపోతున్నాము తెలిసిందా?" అన్నాడు గుణాఢ్యుడు తీవ్రంగా.

"అంటే?" అని నందివర్మ నిర్ఘాంతపోయాడా విషయం పూర్తిగా అవగాహన కాక "అంటే ఏమీలేదు, ఆనాటితో మనకీ, ఈ మహానగరానికీ ఋణం తీరిపోయిన దన్నమాట నేనీ మహామాత్య భారమిక నా నెత్తిమీద పెట్టుకోదలుచుకోలేదు!"

"అంతటి మహాపదవి విసర్జించి వెయ్యవలసినంత అవసరమేమివచ్చింది? మీ శపథానికీ దీనికీ సంబంధమేమీ లేదే?" అన్నాడు నందివర్మ కొంచెం సంకోచిస్తూ

"ఉన్నా సరే? లేకపోయినా సరే! నేనీ దురహంకారపూరితులైన ప్రభువుల సన్నిధి నికనీ నీచదాస్యం చెయ్యదలుచుకోలేదు! ఇక ఈ విషయంలో ఎవరితోను సంప్రతించ దలుచుకోలేదు." అన్నాడు గుణాఢ్యుడెంతో చిరాకుగా.

గుణాఢ్యుడెంతటి దృఢనిశ్చయానికివచ్చివేసిన తరవాతి మరి ఆయననిక ఎవరు కదపలేరని నందివర్మకు తెలియకపోలేదు అయినా సాహసించి నెమ్మదిగా నసిగాడు:

"అయితే ఇంతటి వార్ధక్యంలో—"

"ఇలాంటి ప్రభువుల సేవచెయ్యడంకన్న అడవిలో కాయాకసరు ఏరుకుతినడమే మేలు!" అన్నాడు గుణాఢ్యుడింకా కొంచెం ఘుమఘుమ లాడుతూ

ఇక ఆపైన ప్రసంగిస్తే ఆచార్యుడింకా మండిపడి పోవడం తప్ప వేరే ప్రయోజనమేమీ ఉండదని నందివర్మ గ్రహించి వేశాడు

గుణాఢ్యామాత్యునికి కలిగిన పుత్రికలయిదుగురికి వివాహాలై అత్తవారిళ్ళకు వెళ్ళిపోయారు. ఇక మిగిలిన కుమారులిద్దరు బాగా పసివారు పైగా గుణాఢ్యుని వార్ధక్యం కూడా బాగా ముదిరిపోయింది. అలాంటి సమయంలో వింధ్యాటవికి వెళ్ళి అరణ్యవాసం చెయ్యడమే చాలా క్లేశసాధ్యమైన పని ఆపైన తపశ్చర్య మరింత దుష్కరం. చాలా కాలంనించీ భాగ్యభోగాలు కలవాటుపడిన వారవ్వన్నీ ఒక్కసారిగా విడిచి అరణ్యవాసం చెయ్యడమంటే మాటలతో పనిగాదు

నందివర్మతోబాటు గుణాఢ్యునిధర్మపత్నికూడా అతని కనేక విధాలుగా చెప్పిచూచింది మహామాత్య పదవి నిర్వహించడాని కంగీకరించని పక్షంలో ప్రతిష్ఠాన నగరంలోనే నివసిస్తూ గోదావరీ తీరంలో తపశ్చర్యకుపక్రమించవచ్చుననీ, ఆ వార్ధక్యంలో అరణ్యవాసం అత్యంత దుష్కరమనీ అనేక విధాలుగా చెప్పిచూచింది. ఎంత చెప్పినా గుణాఢ్యుడు తన పట్టు విడవలేదు. రాజులకు, రారాజులకు, దూర దూరంగాతొలగిపోయితీరాలనిపట్టుపట్టాడు. అటుపిమ్మట ఆమె మరి మాట్లాడలేదు. అతని అభీష్టప్రకారం అరణ్యవాసానికవసరమైన ప్రయాణ సన్నాహాలు చేయించింది.

అనంతరం కొన్నాళ్ళకు గుణాఢ్యుడు చక్రవర్తిని సందర్శించి ఆయనకు తన సంకల్పం తెలియజేశాడు.

చక్రవర్తి గీర్వాణ భాషాభ్యాస వ్యవహారం ఇంతవరకు ముదురుతుందని ముందెన్నడు ఊహించలేదు గుణాఢ్యుడు తన శపథం ప్రకారం కవితావ్యాసంగంలో సంస్కృత ప్రాకృతాలు విసర్జించవచ్చుననీ, కాకపోతే మహామాత్యపదవికి కూడా తిలోదకాలిచ్చి ప్రతిష్ఠాననగరంలోనే కాలక్షేపం చేస్తూఉండవచ్చుననీ అనుకొన్నాడు. కాని ఆయన కేవలం వానప్రస్థాశ్రమ పద్ధతి అవలంబింపగలడనీ, వింధ్యాటవిలో అరణ్యవాసం చెయ్యగలడనీ కలలోనైనా ఊహించి ఉండలేదు.

అయినా పైపైకతి మర్యాదగా గుణాఢ్యునివంటి విద్యావయోవృద్ధుల సదుపదేశాలు ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యనిర్వహణ కత్యంతావశ్యకాలనీ, ఒక వేళ వార్ధక్యంవల్ల మహామాత్యపదవి నిర్వహించడానికంగీకరించకపోయిన పక్షంలో ప్రతిష్ఠాననగరంలోనైనా నివసించడానికంగీకరించవలసిందనీ అనేక విధాలుగా బ్రతిమాలుకొన్నాడు. గుణాఢ్యుడంతకన్నా మర్యాదగా ప్రత్యుత్తరం ఇచ్చాడు. ఆ వార్ధక్యంలోనైనా వింధ్యవాసినీ దేవి చరణ సన్నిధిని తపశ్చర్యకంగీకరించవలసినదనీ తన కోరిక మన్నించవలసినదనీ పదేపదే ప్రార్థించాడు.

మహామాత్యుడంతగా ప్రార్థిస్తున్నప్పుడు చక్రవర్తికిక అతని ప్రార్థన అంగీకరించక తప్పలేదు

ఆమరునాడే గుణాఢ్యుడు తన ధనంతి, మహామాత్యసంపత్తిఅంతా ప్రతిష్ఠాన నగర శ్రేష్ఠి శ్రేణికి తెగనమ్మివేసి ఆ మహాధనరాసులన్నీ దేవాయతనాలకు, విద్వాంసులకు, కవీశ్వరులకు, యాచకులకు, దీనులకు పంచిపెట్టించాడు కేవలం వానప్రస్థాశ్రమం స్వీకరించలేదుగాని అదే వ్రతం అవలంబించినట్టుగా కట్టుబట్టలతో వింధ్యాటవికి వెళ్ళిపోయాడు.

బారులుతీర్చి నిలబడిన ప్రతిష్ఠాన నగర పౌరులతని హఠాన్నిర్గమనానికంతో ఆశ్చర్యపడ్డారు.

శర్వవర్మ మూలంగానే ఆ వృద్ధ మహామాత్యునికంతటి విపత్తి, విరక్తి కలిగాయని కొందరు పౌరులతన్ని దుయ్యబట్టారు.

మరికొందరు దీనికంతటికీ చక్రవర్తే మూలకారణమనీ, ఆయనవల్లనే ఇంతింత విడ్డూరాలు పుట్టుకొస్తున్నాయనీ, రాజా తలచుకొంటే దెబ్బలకు కొదవా అనీ అన్నారు.

౧౦

వింధ్యవాసినీ దేవాలయం వింధ్యాటవి మధ్యభాగంలోనే ఉంది అయినా అది అంతగా సాంద్రారణ్యప్రదేశం కాదు. తీర్థయాత్రాపరు లక్కడికి కోకొల్లలుగా రాకపోకలు సాగిస్తూంటారు అందువల్ల ఆ దేవాలయ పరిసరాలలో ఒక చిన్న



ఏరువాక సాగాలోయ్!

ఫొటో—శ్రీపాద వెంకన్న.

# ★ గీర్వాణ భాషాభ్యాసం ★

గ్రామం కూడా పెరిగింది అయితే ఆ గ్రామం సమీపంలో ఎటుచూచినా వింధ్యారణ్యమే. నలుగురైదుగురు దేవాలయార్చకుల కుటుంబాలు తపోనిరతులైన పదిమంది బ్రాహ్మణుల కుటుంబాలు తప్ప, ఆ గ్రామంలో మిగిలినవన్నీ ఆటవికులకు సంబంధించినవే

గుణాఢ్యుడా గ్రామాని కనతిదూరంలో అరణ్యసమీపంలోనే తన కుటీరం నిర్మించుకొన్నాడు. వింధ్యవాసినీ చరణసన్నిధిని స్థిరనివాసంకోసమే మహామాత్యుడక్కడికి విచ్చేశాడన్న వార ఆ గ్రామంలో అందరికీ తెలిసిపోయింది వారందరు ఎంతో భక్తిశ్రద్ధలతో అతని సుఖవసతికి తగిన సదుపాయాలన్నీ ఏర్పాటు చేశారు. అయినా అత డెంతో కాలంవారి ఆతిథ్య మర్యాదలు స్వీకరించ దలుచుకోలేదు. స్వయంగా సేద్యం సాగించి తన కుటుంబం పోషించుకోవాలని నిశ్చయించుకొన్నాడు

కుటీర ప్రాంగణంలో దర్భాసనం మీద మేను వాల్చి వింధ్యవాసినీ దేవాలయ శిఖర సువర్ణకలశంతిలకిస్తూంటే గుణాఢ్యుని కేవేవో దివ్యలోకాలలో విహరిస్తున్నట్టనిపించింది

ప్రాతఃకాల సూర్యకాంతులలో ఆ దేవాలయ శిఖర స్వర్ణకలశం హేమసరోవరంలో వికసించే పైడి తామరపువ్వులాభాసించింది ఒక్కొక్కప్పుడా దేవాలయం అతనికి శిశిరహిమావకుంఠనంతో సాక్షాత్కరించిన వింధ్యవాసనీ దేవతలాగే స్ఫురించేది

గుణాఢ్యుడా ఆనందతన్మయతలో మునిగి బాహ్య ప్రపంచమే విస్మరించేవాడు.

"నా జీవనం అంతా దురహంకార పూరితులయిన దుష్టదక్షిణాపథ రాజన్యుల దాస్యభారంలో కుంగి భంగపడిపోయింది! అహోరాత్రాలా దుర్భర దాస్యంలోపడి వింధ్యవాసినీదేవి అడుగుదామరలే విస్మరించాను సంకల్పించిన మహా కావ్యాలన్ని స్వప్నాలలోనే అంతరించి పోయాయి! ఎంతటి భ్రమ ప్రమాదాలలో పడిపోయాను!

అని అనేక విధాలుగా మథనపడేవాడు క్రమంగా శిశిరం గడిచి చైత్రం ప్రవేశించేసరికి గుణాఢ్యుని జీవితము, హృదయము కొంచెం కుదుటబడ్డాయి అతనితోబాటతని కుటుంబంలోని వారంతా ఆ అరణ్య జీవవానికలవాటు పడ్డారు గుణదేవనందివర్ధులిద్దరు గాఢ జరాభారంలో ఆచార్యుని కేవిధమైన లోపమురాకుండా అతిజాగ్రత్తగా కంటికి రెప్పలా కాపాడుతూ, ఎంతో భక్తి శ్రద్ధలతో శుశ్రూష చేశారు

క్రమ క్రమంగా గుణాఢ్యుని హృదయం తిరిగీ కవితావ్యాసంగంలో పడింది ప్రాతఃకాలం అంతా వింధ్యవాసినీ చరణ సన్నిధిని

గాథ తపశ్చర్యతోనే గడిచిపోయేది. మధ్యాహ్నం కొంచెం విశ్రమించిన పిమ్మట గుణాఢ్యుని మహాకావ్య వ్యాసంగం ప్రారంభమయ్యేది.

అతడెంతో కాలంనించి బృహత్కథా మహాకావ్యం రచించవలెనని సంకల్పించాడు ఇన్నాళ్ళనించీ ఆ సంకల్పాని కంకురార్పణ కూడా జరగలేదుగాని చైత్రమాసంలో అది చిగిరించి మొగ్గదొడిగింది.

గుణదేవ నందివర్మ లిద్దరు అతని ముఖతః ఆ సుధారా ప్రవాహంలో అవతరింపబోయే బృహత్కథా గంగావాహినికి భగీరథులై నిలిచారు. భూర్జ పత్రాలలో ఆ కథ అంతా లిఖిస్తే తమ జన్మ ధన్యమైపోగలదని భావించారు.

చిత్రవిచిత్రమైన దేవమానవ గంధర్వ గాథలతో విలసిల్లే ఆ మహాకావ్యం గీర్వాణ వాణిలో అవతరిస్తే అది వాల్మీకి వ్యాసమహర్షుల మహాకీర్తికూడా కించపరగలదనీ ప్రపంచంలో అంతటా అజరామరమై వర్ధిల్లగలదనీ మొట్టమొదటగా నందివర్మ గుణసేను లిద్దరు అనుకొన్నారు అయితే ఆవిషయం ఆచార్యుని ఎదుట ప్రసంగించడాని కెవరికీ సాహసం కలగలేదు.

కాని నందివర్మ మహాకావ్య ప్రారంభ సమయంలో ఆమాట ఆచార్యుని ఎదట ఎత్తకుండా ఉండలేకపోయాడు. దానితో గుణాఢ్యు డతనిపై విరుచుకు పడ్డాడు:

“ఏమైనా సరే! నేను నాఘోరశపథం విసర్జించేది లేదు! సంస్కృత శౌరసేనీ మాగధీ ప్రాకృతాలు రాజాధముల ప్రాపకంలో పడి భ్రష్టమై పోయాయి! నేనిక ఆ అధమాధముల ఆప్యాయతకోసం కవితా వ్యాసంగం చెయ్యదలుచుకోలేదు అమాయికులైన ఆటవిక జనం అభినందన కోసమే నా మహాకావ్యం రచించవలెనని సంకల్పించాను అందువల్లనే అమాయికులైన ఆ ఆటవికుల పైశాచీ ప్రాకృతంలో నేనా బృహత్కథా మహాకావ్య రచన కుపక్రమిస్తున్నాను!”

ఆచార్యు డీవిధంగా మండిపడిన తరవాత నందివర్మ కిక ఊపిరాడలేదు.

అటుపిమ్మట ఒక శుభముహూర్తంలో బృహత్కథా మహాకావ్య రచన ప్రారంభమై శరవేగంతో సాగిపోయింది

నందివర్మ గుణసేను లిద్దరు అతని ముఖతః అనర్గళ ఝరీవేగంతో సాగిపోయే బృహత్కథా కవితావాహినీ గాథలు వెనువెంటనే భూర్జ పత్రాలపై లిఖించడానికికూడా అల్లల్లాడిపోయారు!

క్రమక్రమంగా నిసర్గసుందర ప్రకృతి పరిసరాలలోను, వింధ్య వాసినీచరణసాన్నిధ్యం లోను, గుణాఢ్యుని హృదయ శరీరాలలో అపూర్వమైన యౌవనోత్సాహాలంకురించి వేయివిధాలుగా విజృంభించాయి

అలాగ ఒక సంవత్సరం గడిచిపోయేసరికి గుణాఢ్యుని బృహత్కథలో 6 లక్షల శ్లోకాల గ్రంథం నిర్విఘ్నంగా కొనసాగిపోయింది. ఇక మిగిలినది ఒక లక్ష గ్రంథం మాత్రమే

అప్పటికప్పుడే ఆటవికులందరు ఆ గాథలు గానం చెయ్యడం మొదలు పెట్టారు వింధ్య పర్వతారణ్యాలలో ప్రతిధ్వనించే ఆ గాథా సంగీతం వింటూంటే గుణాఢ్యమహాకవి హృదయం ఉత్సాహానందాలతో ఉరకలు వేసింది

“అమాయికులయిన ఆటవికు లానందించి గానం చేసినదే మహాకవిత! అహంభావ పూరితులయిన మహారాజుల ఆస్థానాలలో గీర్వాణ కవిత కేవలం గణికగా మారి భ్రష్టమైపోయింది!”

అని గుణాఢ్యు డొకనాడు నందివర్మతో అన్నాడు.

“మీ రన్నది నిజమే! అయితే “వినా శ్రయా న శోభంతే కవితా వనితా లతా” అని పెద్దలంటారు గదా! రాజాశ్రయం లేనిదే కవిత పదిమంది విద్వాంసుల నోళ్ళల్లోను పడదు గదా! అమాయికులయిన ఆటవికు లేవో వెర్రిమొర్రిగా పాడితే మాత్రం ప్రయోజన మేమిటి?” అన్నాడు నందివర్మ

మీ ప్రతిష్ఠ ప్రతిష్ఠాన నగరంలో అంతటా మారుమోగిపోతున్నదట!” అన్నాడు గుణసేనుడు

“నీకెలాగ తెలిసింది?” అని ప్రశ్నించాడు గుణాఢ్యుడు

గుణసేనుడు తనకథ ప్రారంభించాడు

“మన ఆటవికులలో కొంతమంది ప్రతిదినము హాలసాతవాహన చక్రవర్తికి అడవి పందిమాంసం కానుకగా తీసుకుపోతూంటారట ఒకనాడు చక్రవర్తి కామాంసం రుచించక దానికి కారణమేమని ప్రశ్నించారట దానిపైన మహానసాధికారులందరు మహాప్రభూ! ఆటవికులందరు అహోరాత్రాలు గుణాఢ్యమహాకవి గాథలుపాడుకుంటూ ఆ తన్మయతలోపడి తిన్నగా వేటాడడం కూడా మానివేశారట! అని సమాధానం చెప్పారట!” అన్నాడు

ఆ ప్రత్యుత్తరంవిని గుణాఢ్యుడొక్కసారిగా విరగబడినవ్వాడు!

ఒకనాడు చక్రవర్తికా అడివిపందిమాంసం అంతగా రుచించదనిమాట వాస్తవమే! అయితే మహానసాధికారులు వంటలో ఏర్పడినతమతప్పిదం తప్పించుకోడానికని అదంతా ఆటవికుల నెత్తిమీదకి తోసివేశారు. ఆటవికుల కొక్కొక్కనాడు బాగా బలిసిన అడివి పందిమాంసం దొరకకపోవడంకూడా జరుగుతూనేఉంటుంది. వెంటనే వారంతా తమ మీదపడిన ఆ తప్పిదం అంతా గుణాఢ్యుని కావ్యగానం మీదికి తోసివేశారు. ఏమైనా ఇకముందలాంటి అపరాధం జరగకుండా జాగరూకత వహించగలమని చెంపలు వేసుకొన్నారు. ఆటవికులతప్పిదానికనేక కారణాలున్నా గుణాఢ్యుని గాథాగాన తన్మయతకూడా ఒక చిన్న కారణమే అయితే హఠాత్తుగా తమపైన పడిన ఆ అపరాధం తప్పించుకోవడాని కమాయికంగా వారా కారణం పేర్కొన్నారు!

క్రమక్రమగా గుణాఢ్యుని మహాకావ్య కీర్తి ప్రతిష్ఠాన నగరంలోను, దక్షిణాపథ విద్వాంసులలోను బాగా వ్యాప్తిచెందింది.

గుణాఢ్యుని అరణ్యప్రవేశం జరిగిన పిమ్మట ఇంచుమించుగా ఒక సంవత్సరం వరకు శర్వవర్మ గుండెమీద చెయ్యివేసుకొని హాయిగా నిద్రపోయాడు.

గుణాఢ్యుని అనంతరం చక్రవర్తి శర్వవర్మనే మహామాత్య పదవిలో ప్రతిష్ఠించాడు.

అప్పటినించీ శర్వవర్మామాత్యుని ఆజ్ఞ ప్రతిష్ఠాన నగరంలోనేకాక దక్షిణాపథంలో అంతటా అప్రతిహతంగా సాగిపోయింది. ఈలోగా చక్రవర్తికింకొక అదృష్టంకూడా కలిసివచ్చింది. క్రమంగా కొన్నాళ్ళకు లీలావతీదేవికి కూడా ఒక కుమారుడు కలిగాడు.

ఆ కుమారుడు కలగగానే చక్రవర్తికా శిశువుకే యౌవరాజ్య పట్టం కట్టవలెననే అభిలాష అంకురించింది. దానికి మలయవతీదేవి కుమారుని అనారోగ్యంకూడా తోడుపడింది. ఆమెం లీలావతి తన గీర్వాణ భాషా శిక్షణకు గురుదక్షిణగా తన కుమారునికి యౌవరాజ్యాభిషేకం చెయ్యవలసిందని పట్టుపట్టింది. కుమారుడు యువసార్వభౌముడైనప్పుడు జననికెలాగైనా పట్టమహిషీ గౌరవం తప్పదు గదా! కనకనే లీలావతి ఆ విషయంలో అంత పట్టుపట్టింది

చక్రవర్తికా పరిస్థితులలో లీలావతి కుమారునికి పట్టంకట్టక తప్పలేదు ఆమె పట్టమహిషి అయిన తరవాత స్వీయ ప్రతిభా చాకచక్యంవల్ల లీలావతీ వివాహానికి కారణభూతుడయిన శర్వవర్మామాత్యుని గౌరవం మరింత పెరిగింది

అంతవరకు శర్వవర్మపట్టినదంతా బంగారమే అయిందిగాని గుణాఢ్యుని మహాకావ్య ప్రతిష్ఠప్రతిష్ఠాన నగరంలో వ్యాపించినకొద్దీ శర్వవర్మ హృదయంలో కొంచెం అలజడి ప్రారంభమైనది.

దాని కింకొకటి కూడా తోడుపడింది.

లీలావతికి పట్టమహిషీ గౌరవం లభించిన తరవాత మలయవతి ఇక ఆ అంతఃపురంలో

(54-వ పేజీ చూడండి)

# ఆషాఢ తగూ

గోపాలం ఈలవేసుకొంటూ హుషారుగా ఇంట్లోకి వచ్చాడు. వస్తూనే హాల్లో బల్లమీద ఉన్న కొత్త రేడియోని ఇంతింత కళ్లు చేసి చూస్తూ దగరికి నడిచాడు. ఫిలిప్స్ రేడియో చిన్న సైజుగా కొత్త మోడలు అందంగా ఉంది. సన్నగా ఫిడేలు వాద్యం శ్రావ్యంగా వినవస్తూంది. గోపాలాని కేమీ పాలుపోలేదు. వింతగా ఆలోచిస్తూ అలాగే నిలబడిపోయాడు. శ్రీమణి గుమ్మంలో కనబడగానే "హుఁ" అని విసురుగా గదిలోకి వెళ్లిపోయాడు. శ్రీమణి చిరునవ్వు నవ్వుకొంటూ పమిట దోపుకొని వంటింట్లోకి వెళ్లిపోయింది

వంటింట్లో వంటమనిషికి వంట సంగతులు పురమాయిస్తూనే మణి, గోపాలం ఏం చేస్తున్నాడో ఓ కంట కనిపెడుతూనే ఉంది గోపాలానికి ఈ విధంగా కోపం వస్తుందని, దానికి కారణ మేమిటో శ్రీమణికి ముందుగానే తెలుసు. అయినా గుట్టుచప్పుడిగా ఏమీ ఎరగనట్లు ఊరుకొంది అసలు విషయం గోపాలమే ఎత్తేవరకు మౌనంగా ఉండదలుచుకొంది.

గోపాలం గబగబ పంట్లాము, షర్టు విప్పి మంచంమీద పారేసి (కోపంలో అవి ఎక్కడ పెట్టాలో మరిచిపోయి) తుండు తీసికొని చరచర దొడ్లోకి వెళ్లి బావిలో నీళ్లు తోడుకొని పోసేసుకోడం మొదలెట్టాడు. రోజూ మణి తోడి ఇస్తూంటే అందుకొని పోసుకొనేఅలవాటు. ఇది కోపం వచ్చిన లక్షణం అన్నమాట. మణి గబగబ వెళ్ళి తోడి ఇవ్వడానికి పూనుకొంది. పెళ్లి కొడుకల్లే కొంతసేపు అందుకుని పోసుకొని అంతలో పరధ్యానంలోంచి తెప్పరిలి గబగబ తుడుచుకొని లుంగీ, బనీను వేసుకొని (మణి తీసుకొచ్చి అందివ్వగా) వంటింటి గుమ్మంమీద కూర్చున్నాడు తగాయిదాకి సిద్ధంగా.

"మాటమాత్రం నాతో అనకూడదా? అంత తొందర అని అనుకోలేను లేకపోతే ఇవ్వాళే తెచ్చేవాడిని"

"అసలు కొనే ఉద్దేశం ఉందన్నమాటా మనసులో" అని పకపక నవ్వేసింది మణి గోపాలానికి కోపం ఎక్కువైపోయి బుంగమూతి పెట్టేశాడు.

అసలు సంగతి ఇది; పెండ్లయిన సంవత్సరంనించి కూడా ఇద్దరూ చెరొక అకౌంటు పెట్టుకొన్నారు పోస్టాఫీసులో.

"రేడియో కొంటే బాగుంటుందండీ" అంది శ్రీమణి ఒకనాడు.

"అంత డబ్బూ పోగడినట్టుందే" అని అన్నాడు గోపాలం

"అబ్బె నేనేం కాదు, నాదాంతో మంగళసూత్రం తాడు చేయించుకోవాలి ఇంకా డబ్బుకూడాక మీరుకొనకూడదేం? అయినా నా దగ్గర అంత డబ్బెక్కడిదీ, మొన్ననేగా పట్టుచీర కొన్నదీ?" అంది శ్రీమణి

"ఏమో, ఆ సంగతి నాకు తెలీదు నేను మాత్రం కొనదలచుకోలేను ముందు ముందు ఎవరి కవసరమో వాళ్ళే కొంటారు" అని ముసిముసి నవ్వులు నవ్వుకొంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

గోపాలాని కసలు మనసులో కొనే ఉద్దేశం ఉన్నది. "శ్రీమణి ఇక రెండు మూడు నెలల్లో ఉద్యోగానికి రాజీనామా ఇస్తుంది కదా. పాపాయి పుట్టగానే రేడియో అప్పుడేగా ప్రెజెంటు చేస్తే బాగుంటుంది, తన కాలక్షేపానికి ఒంటరిగావుండే సమయాలలో పనికొస్తుంది," అని అలాగ దబాయించేశాడిప్పుడు

రాత్రి యింటికి రాగానే భోం చేస్తూండగా "పోనెండి మీకంత పట్టుదలగావుంటే నేనే కొంటానులెండి రేపు బ్యాంకునుండి తెచ్చి పెట్టండి మూడొందలూనూ." అన్నది శ్రీమణి

ఇవంతా జరిగి వారమైంది శ్రీమణి డబ్బు తెమ్మని మళ్ళీ అడగనూ లేదూ, గోపాలమూ కిమ్మనలేదు

తీరా ఇవాళ ఇంటికొస్తే ఎదురుగా కొత్త రేడియో శ్రీమణి అంత గుంభనంగా యెందుకు చెయ్యాల్సి వచ్చిందీ పని?" అని గోపాలానికి కోపం గోపాలం సరిగ్గా ఇలాగే ఊహిస్తాడని శ్రీమణికి తెలుసు అందుకే అంత నవ్వు

వంటింట్లోంచి వంటమనిషి రమణమ్మ "అది కాదు బాబూ," అని ఏదో చెప్పబోతూంటే, శ్రీమణీ, గోపాలం, ఇద్దరూ ఒకేసారి "మీ రూరుకోండి, ఏం తెలీదు" అని వారించేశారు. ఆవిడకూ రెండు మూడు నెలలనుంచీ ఇక్కడ పని చేస్తూండటంతో వీళ్ళ గిల్లికజ్జాలు అన్నీ బాగా వంటబట్టినయ్ ఆవిడకూడా నవ్వుకుంటూ తన వంట పనిలోనిమగ్నమయింది వంటింట్లో ఇద్దరూ నవ్వువ్రతం పట్టగా, కోపం రెచ్చిపోయి గోపాలం "హుఁహుఁ" అని అంటూ తన గదిలోకి విసురుగా పోయి మంచంమీదపడుకొని దొర్లాడు.

"అది కాదండీ" అని బతిమాలే ధోరణిలో శ్రీమణి గదిలోకి రాగా "నువ్వేం నాతో మాట్లాడక్కరలేదు, నీకూ నాకూ రైరై" అని గోడవేపు తిరిగి కళ్లు మూసుకున్నాడు మణి నిట్టూరుస్తూ వంటింట్లోకి వచ్చేసింది

"ఈయన కిలాగ నచ్చచెప్పటం, కోపం వస్తే రెండోమాటే వినిపించుకోరు. తన ధోరణి తనదే కాని."

"అబ్బాయి సంగతి నీకు తెలుసుకదమ్మా, ఉన్న సంగతి ఇందాకనే చెప్పేస్తే తీరిపోయేది కదా" అన్నది రమణమ్మ

హాల్లో చెప్పులు విడుస్తున్న చప్పుడువిని గోపాలం తల ఇటు తిప్పి చూశాడు. మామగారు వంటింట్లోకి వెడుతున్నారు.

(54-వ పేజీ చూడండి)

మాధవపెద్ది సుబ్బలక్ష్మి




## 31

హారిహరుడున్న ఇల్లు అంత మంచిది కాదు. క్రింద అంతస్తులో చెమ్మగా ఉండే గదులు—అవి రెండే. చటుక్కున వీధిలోంచి వస్తే ఎక్కడే వస్తువున్నదీ కనబడనంత చీకటిగా కూడా ఉంటాయి. ఇలాంటి ఇంట్లో సర్వజయ యెన్నడూ కాపురముండి యెరుగదు. వాళ్ళ ఊళ్ళో యిలు పాతదయినా బాగా వెలుతురూ, గాలీ వచ్చేటంత పెద్ద పెద్ద గుమ్మాలూ, కిటికీలూ ఉండేవి. కప్పు చాలా యెత్తుగా వుండేది. ఈ యింట్లో ఈ చెమ్మ, ఈ చీకటి సర్వజయకి తలనొప్పి కలిగించేవి. అపూ సాధారణంగా ఇంట్లో వుండనే వుండడు. ఎండ తగిలి ఏపుగా ఎదుగుతూ వచ్చే మొక్కలాగా వాడి ముఖం ఎప్పుడూ వెలుగునే చూస్తూ ఉంటుంది. నిశ్చిందిపురం మైదానంలో మంచి ఏటిగాలి ఒడిలో పెరిగిన వాడికి ఈ చీకటి గదుల్లో ఉండటం అంటే ఊపిరాడేది కాదు. ఒక్క క్షణంకూడా వాడికి ఇంట్లో కాలు నిలిచేది కాదు.

కాశీ చూసి వాడు కొంచెం నిరుత్సాహ పడ్డాడు. పెద్ద పెద్ద ఇళ్లు, మేడలూ వుంటే యేం లాభం? ఇక్కడసలు అడవి అనేదే లేకపోయె.

ఓనాడు సందెవేళ బెంగాలీ హరిదాసు గారు—హరిహరు నింటికి వచ్చాడు. అమాటా ఈమాటా మాట్లాడి, "ఏడీ? మీ అబ్బాయి ఎక్కడికి వెళ్లాడు?" అని అడిగాడు.

"ఎక్కడికో ఆడుకోటానికి వెళ్ళి వుంటాడు. బహుశా దశాశ్వమేధ ఘట్టం వైపుకే వెళ్ళివుంటాడు." అన్నాడు హరిహరుడు.

"మీ అబ్బాయికి నాదగ్గిర చాలా చనువు ఏర్పడింది. ఆ రోజున ఘట్టందగ్గిరకు పిలిచి చాలా సేపు మాట్లాడాను. గవ్వలంటే వాడికి చాలా యిష్టం. అందుకని ఈ సముద్రపు గవ్వలు రెండూ మొన్న ఏదో వ్రత సందర్భంలో యెవరో యిస్తే వాడికిద్దామని తీసుకువచ్చాను. వీటిని మీ దగ్గర ఉంచి, వచ్చాక ఇవ్వండి వాడికి" అని ఇచ్చాడు...

మార్గశిరమాసం చివరలో నేను స్కూల్లో చేరుతానని అపూ తండ్రి దగ్గిర పట్టు పట్టాడు—"అందరూ స్కూల్లో చదువుకుంటున్నారు, నేనూ చదువుకుంటాను నాన్నా: ఈ గల్లీమలుపు తిరిగి కొస్తదూరం వెడితే చాలు, మంచి స్కూలుంది అక్కడ" అన్నాడు.

అనువాదం:
**మద్దిపట్ల సూరి**

హరిహరుడు కొడుకుని పాఠశాలలో చేర్పించాడు. విద్యార్థి వేతనాలిచ్చే సదుపాయం కల పాఠశాలే అయినా ఇంగ్లీషుకూడా చెపుతారు. ప్రసన్న మాష్టారి స్కూల్లో మానేసి అయిదేళ్లయింది. మళ్లీబళ్లో ప్రవేశించటం అంటూ ఇదే.

మాఘమాసం మధ్యలో హరిదాసు గారు ఓ రోజున ఏదో కాగితం చేత పుచ్చుకుని వచ్చాడు హరిహరు నింటికి. ఆ కాగితం చూస్తూ "చదివి చూడండిది ఒకసారి. ఇలా వ్రాసి యిచ్చినది ఉంటే ఏమవుతుంది?" అని అడిగాడు. హరిహరుడు చదివి చూశాడు—కాశీవాసి అయిన రామగోపాల చక్రవర్తి అనే ఒకానొక వ్యక్తి హరిదాసు గారి పేర స్వగ్రామంలో యించుమించు నాలుగెకరాల భూమి వ్రాసి యిచ్చిన దానపత్రం అది. ఫలానా వాళ్లు సాక్షులు, మకాం: దశాశ్వమేధ ఘట్టం, ఫలానా తేదీ... 'అసలు విషయమేమిటో తెలుసా? మా దేశంలో కుముర్ అనే గ్రామంలోని రామగోపాల్ చక్రవర్తి చాలా పండితుడు. ఇంకో ప్రాణానికి పోతాడనగా రామధన్! నువ్వు యేమీ లేనివాడివి. నీకో నాలుగు ఎకరాలు దానపత్రం రాసి యిద్దామనుకుంటున్నాను. తీసుకుంటావా మరి?' అని అన్నాడు నాతో. సద్బ్రాహ్మణుడు. స్వయంగా ఇస్తానంటూంటే తను తీసుకుంటే దోషమేముంది? అనుకున్నాను. తర్వాత ఆయన నోటి మాటతో ఇచ్చాడు. ఆయ నేదో ఇచ్చేశాడు. నేనివ్వాళ్లిమంచీ ఆ విషయమే పట్టించుకో లేదు. ఎదో కాశీలో ఉంటున్నాను. ఇంటిపట్టున ఉండటం లేదుగా. ఏం చేసుకుంటాను భూమి?...తర్వాత చక్రవర్తి గారు చనిపోయారు. ఆభూమి యివ్వటం నోటిమాట మీదే ఉండిపోయింది. ఇన్నాళ్ళకిపుడు ఇంటికి వెళ్ళాలనే ఆలోచన వచ్చింది. పిల్లాజెల్లాలేని బ్రతుకేం బ్రతుకండీ? మీతో చెప్పటానికేం, మూడు వందలు కూడబెట్టాను.—వీళ్ళతో కడుపు నింపుకొని కూడబెట్టాననుకోండి. ఇంకో రెండు వందలుంటే చక్కని శ్రోత్రియ కుటుంబంలోని పిల్ల దొరుకుతుంది. అదే కనుక జరిగితే అప్పుడు భూమి అవసరం కూడా ఉంటుందిగా! నోటి మాటతో ఇచ్చిన దానం, చక్రవర్తిగారి కొడుకులు మన్నిస్తారా అని ఆలోచించాను. ఆలోచించి ఆలోచించి ఈ కాగితాన్ని సృష్టించాను. నేనే కూర్చుని రాశానండీ సాక్షుల పేర్లూ అవీ అన్నీ కల్పించినవే. కాగితం రాసి ఉంటే ఒప్పుకోకపోరనుకుంటాను. వెళ్ళి ఇదుగో మీ నాన్నగారు వ్రాయించి యిచ్చిన కాగితం అని చూపిస్తాను—"

## జరిగిన కథ:—

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లల కిదేం పట్టింది? దుర్గకి ఒక్క నిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీవింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. బడి చదువుకూడా వాడికి ఏమీ అంటలేదు. ఇంట్లోనే తండ్రితాలూకు పుస్తకాలన్నీ చదివేస్తూ ఉండేవాడు. ఒకసారి వాళ్ల ఊళ్లోకి ఒకనాటక సమాజం వచ్చింది. వాళ్లువేసిన నాటకాలు చూసి అపూ తన్మయుడైపోయాడు. తనుకూడా పెద్దయ్యాక నాటక సమాజాల్లో చేరి నటుడైపోవాలని కలలు కన్నాడు. తను చూసిన నాటకం కథ ఆధారంగా స్వయంగా ఒక నాటకంకూడా రాసేశాడు. మొత్తానికి వాడి ఆదర్శాలకు ఆకాశమే అవధి. దుర్గకి మంచి సంబంధం ఏదన్నా చెయ్యాలని తల్లి ఆవేదన పడేది. కాని మంచిసంబంధాలనేవి హరిహరరాయ్ కుటుంబానికి ఎన్నటికీ అందని ద్రాక్షపండ్లే. ఎప్పుడో ఏదో అదృష్టం కలిసివచ్చి తమ సంసారం బాగుపడుతుందనీ, దుర్గ గొప్పఇంటి కోడలైపోతుందనీ, అపూ పెద్దవాడై ప్రయోజకుడై తమ కష్టాలు గట్టెక్కిస్తాడనీ ఆమె కలలు కనేది. కాని ఆ కలలు కల్లలుగానే మిగిలిపోయాయి.

ఒకసారి దుర్గకి జ్వరం పట్టుకుని ఎన్నాళ్ళకీ తగ్గలేదు. హరిహరుడు ఊళ్ళోలేడు. తల్లీ, పిల్లలూ తిండికికూడా మొహం వాచిపోయారు. ఆఖరుకి ఒక భయంకరమైన రాత్రివేళ, వర్షం ప్రళయంగా కురుస్తున్నవేళ దుర్గ ప్రాణవాయువులు అనంతంలో లీనమైనాయి. ఆమె జనన మరణ, సుఖదుఃఖ ద్వంద్వాతీతమైన ఏదో అజ్ఞాతలోకానికి వెళ్లిపోయింది. హరిహరుడు ఊరినుంచి తిరిగి వచ్చినతరవాత గాని దుర్గ మరణం వార్త అతనికి తెలియలేదు. పిమ్మట హరిహరుని కుటుంబం అంతా నిశ్చిందిపురం విడిచిపెట్టి కాశీ చేరుకుంటారు. హరిహరుడు కాశీలో హరికథా కాలక్షేపాలతో జీవయాత్ర సాగిస్తూంటాడు.



# పథేర్ పాంచాలి



అని చెప్పి అతడు వెళ్లిపోయే ముందు—
"మరో మంచిమాట, మంగళవారం—మాఘపూర్ణిమ రోజున నేను మీ అబ్బాయిని 'శ్రీ ఉటా' రాజాగారింటికి వెంటపెట్టుకు తీసుకు వెడతాను. ప్రతి యేడూ ఆ రోజున రాత్రి బ్రాహ్మణ సమారాధన చేస్తూ ఉంటారుగా" అని చెప్పి కొంచెం సగర్వంగా-"నాకు ఆహ్వాన పత్రిక కూడా పంపారు ఒకటి. భలే ఘనమయిన సమారాధన లెండి... నేను వచ్చి మీ వాడిని వెంటపెట్టుకుని వెడతానుగా మీకెందుకు" అన్నాడు.

మాఘపూర్ణిమనాడు తెల్లవారుఝామునుంచి జట్లుజట్లుగా స్నానానికి వెడుతున్న గుంపుని చూసి సర్వజయ విస్తుపోయింది. గుంపులో స్త్రీలూ, పురుషులూ 'జయ్ విశ్వనాథ్‌కీ జయ్' అని కేకలేసుకుంటూ మాఘమాసపు చలిని లెక్క చెయ్యకుండా స్నానానికి పోతున్నారు. కొంచెం ప్రొద్దు ఎక్కాక తమ మేడమీది పంజాబీ స్త్రీతో కలిసి సర్వజయ కూడా స్నానానికి వెళ్ళింది. స్నానఘట్టాలు, ఆలయాలు, వీధులూ అన్నీ ఉత్సవానికి వచ్చిన స్త్రీ పురుషులతో నిండివున్నాయి. నీళ్ళలో దిగటం ప్రాణాంతకంగా ఉంది. షష్ఠీ ఆలయంలో కాషాయి రంగు జెండా ఎగురుతోంది.

సంజె పడబోయేముందు హరిదాసు అపూని తీసుకువెళ్లటానికి వచ్చాడు. మీరు వెళ్లి పంపండి. ఎవరూలేరు పాపం, అపూ అంటే తగని అపేక్ష. దశాశ్వమేధఘట్టంలో దగ్గరకు పిలిచి కూర్చోపెట్టుకొని, కాసేపు కబుర్లాడి, ఓనాడు బొప్పాయి పండుకొని పెట్టాడట. పంపించండి మంచివాడు-అన్నది సర్వజయ భర్తతో.

అపూ ముందు హరిదాసుతో అతడి బసకి వెళ్ళాడు......అట్టే సామానులేవీ లేవు యింట్లో. చిన్న బల్ల ఒకటి, ఓచిన్న రేకు పెట్టె, తాడుతో కట్టిన దళ్లాం, ఓ జత పాంకోళ్లు. గోడను తగిలించిన తామర పూసల పేరు ఒకటే ఉంది.

"కమలాఫలం తింటావా?" అని అడిగాడు హరిదాసు.

"ఉన్నదా మీ యింట్లో?" అన్నాడు తల ఊగిస్తూ అపూ.

ఎంచేతనో ఏమోకాని ఈ హరిదాసు

దగ్గిర అప్పూకు బిడియం కాని సంకోచం కాని కలగ నేలేదు. కమలా ఒలుచుకుంటూ "కాలే వర్షతు పర్జన్యః... వచ్చునా మీకు?" అని అడిగాడు.

"బాగా వచ్చు. రోజూ చదువుతూనే ఉంటాను గా. ఎప్పుడూ విన లేదా?"

"ఇప్పుడోకసారి చదవరాదూ?"

హరిదాసు రాగవరుసనే చదివాడు. కాని వాళ్ళ నాన్న నోటిమీదుగా విన్నప్పుడే బావుంది వాడికి. దాసుగారిది ఒట్టి బొంగురు గొంతు.

తమ ఊరు తీసుకు వెళ్ళటానికని దాసుగారు మట్టితో-రాతితో తయారైన కొన్ని చిన్న చిన్న వస్తువులు సంపాయించి ఉంచారు. ఆట బొమ్మలు, విగ్రహాలు, సాలగ్రామాలు, రుద్రాక్షలు మొదలైనవి. "కాశీలో దొరికే వస్తువులివి. అక్కడికి వెడితే 'కాశీనుంచి ఏం తెచ్చావ్? ఏం తెచ్చావ్' అని అందరూ అడుగుతారు. అందుకని తీసుకువెడుతున్నాను" అని చెప్పాడు అప్పూతో.

సందులూ-గొందులూ చాలా దాటి ఓ చీకటి గుయ్యారంగా ఉన్న ఇంటి గుమ్మం ముందుకి వచ్చి ఆగాడు హరిదాసు. క్రిందుగా ఉన్న గుమ్మం దాటి, హరిదాసుతో లోపలికి వెడుతూంటే ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. లోపల ఎవరూ లేరేమో అని తోచింది అప్పూ మనస్సుకి. హరిదాసు రెండుమూడుసార్లు గట్టిగా దగ్గి చప్పుడు చేసే సరికి, వసారాలో బల్లమీద పడుకుని నిద్ర పోతున్న ఎవరో వ్యక్తి లేచి, హిందీలో ఏమిటో అడిగాడు. అప్పూ కది ఏమిటో అర్థం కాలేదు. హరిదాసు తాను ఫలానా అని చెప్పాక కూడా అతడెవరైందీ ఆ వ్యక్తికి తెలియకనైనా పోవాలి, లేదా ఇలా వస్తారని అనుకోకనయినా పోవాలి-చివరకు విసుగ్గా ఎవరినో ఏదో అడగటానికి వెళ్ళాడు. అతడు మళ్ళీ తిరిగిరావటం ఆలస్యం చెయ్యటం చూస్తే-వచ్చి మీకిక్కడ భోజనం లేదు, ఏం లేదు వెళ్ళండని చెపుతాడేమో అని తోచింది అప్పూ మనస్సుకి. ఏమయితేనేం-పదిహేను నిమిషాలు చీకట్లో అలాగే నిలబడి ఉన్నాక ఆ వ్యక్తి తిరిగివచ్చి, వసారాలో మసకవెలుగ్గా ఉన్న ఓ మూలపీటకి విస్తళ్ళు వేసి, ఇత్తడిలోటాలతో నీళ్ళు పెట్టి వెళ్ళాడు. హరిదాసు ఏమిటో భయభయంగా వెళ్ళి కూర్చున్నాడు. రాజాగారింట్లో ఏం పెడతారో తెలియదు. అప్పూ ఇంకొక ఇరవై నిమిషాలు విస్తరిముందు ఆదుర్దాగా అలాగే కూర్చున్నాడు-ఎవరూ వచ్చిన జాడకన్పించ లేదు. అసలు భోజనం ఉందా లేదా అని సందేహిస్తున్న సమయంలో వడ్డించే వ్యక్తి రావటం సంభవించింది. ముందపాటి పూరీలు, రుచీపచీ లేని కూర, చివరకు పెద్ద పెద్ద లడ్డూలు తీసుకొచ్చి వడ్డించాడు ఆ లడ్డూలు అప్పూ పళ్ళకు కొరుకుడు పడనంత గట్టిగా ఉన్నాయి. హరిదాసు ఆ మందపాటి పూరీలనే అడిగి అడిగి పదిపన్నెండు ఆబగొద్దీ తిన్నాడు. మధ్య మధ్య అప్పూ వైపు చూస్తూ "కడుపు నిండా తిను, సిగ్గుపడకు. లడ్డూలు చాలా గట్టిగా వున్నాయి కదూ? నా పళ్ళు ఇప్పటికీ గట్టిగానే ఉన్నాయి, బాగా నమలగలను" అన్నాడు.

నూరేళ్ళు కలసి ఒకచోట ఉన్నా, ఏదో ఓ విశిష్టమైన సంఘటనతో హృదయకవాటాన్ని తెరవకుండా ఉంటే దూరదూరంగానే ఉంటారు మన హృదయాలకు. ఇవాళ ఈ భోజనానికి రావటంలోని అనాదరణ అవజ్ఞ కుర్రవాడైనా అప్పూ గ్రహించాడు. దానికితోడు అతడా తినటంలో చూపిన ఆత్యాశ అప్పూ హృదయాన్ని గాయపరచింది. ఈ హరిదాసు ఒక అభాజనుడనిపించింది వాడిమనస్సుకి. ఈ హరిదాసు ఎప్పుడూ ఏమీ తినినవాడు కాదులా ఉంది. పాపం అందుకనే అలాంటి లడ్డూలు కూడా అంత ఇదిగా తింటున్నాడు. అమ్మతో చెప్పి ఓ రోజున అతణ్ణి ఇంటికి తీసుకెళ్ళి భోజనం పెట్టించాలి—అనుకున్నాడు.

ప్రేమ మొదలైనవాటి అన్నిటికంటె జాలి అనేది చాలా విలువయినది. దానికంటె చాలాగట్టిది. ఒక్క లడ్డూ తినటంలో చూపించిన వాపిరితనం కారణంగా వాడి పసి హృదయంలో ఈ రెణ్ణాళ్ళ పరిచితుడు, పరాయి దేశస్థుడు అయిన హరిదాసు—వాళ్ళ అక్క, గుల్కీ వాళ్ళకోవకి చెందినవాడయాడు.

ఆ తర్వాత కొద్దిరోజులకే ఆ హరిదాసు తమ ఊరు వెళ్ళిపోయాడు. అతడి బలవంతం వల్ల రాజ్ ఘాట్ స్టేషన్‌లో అతడ్ని రైలెక్కించటానికి హరిహరుడు అప్పూని కూడా వెంటపెట్టుకు వెళ్ళాడు. ఇరవై రెండేళ్ళ క్రితం తానెందుకు తన ఊరు వెళ్ళాడో, ఇప్పుడీ హరిదాసు కూడా—ప్రస్తుతం తనకంటె ఏడెనిమిదేళ్ళు పెద్దవాడయినా—అందుకే వెడుతున్నాడు. అంటే క్రొత్తగా మళ్ళీ పెళ్ళి చేసుకుని సంసారం చేద్దామనే తలంపుతో వెడుతున్నాడు. కనుక తనకు మాత్రం వయసు ఏం చెల్లిపోయింది? ఏపని చెయ్యాలన్నా సమయాభావం ఏముంటుంది?

రైలు బయలుదేరే సరికి అప్పూ కళ్ళు చెమ్మగిలాయి. పసివాళ్ళ హృదయాల్లో అప్పుడప్పుడు వయసు చెల్లినవాళ్ళ మీద స్థిరమైన నిజమైన అపేక్ష పుట్టుకొస్తూ ఉంటుంది. దుర్లభమైనది కనుక అది చాలా విలువైనది.

మాఘమాసం చివరలో ఓ రోజున హరిహరుడు ఇంట్లోకి రాగానే కూలపడిపోయాడు. సర్వజయ ఏదో పనిలో ఉన్నదల్లా-దాన్నలాగే వదిలేసి, ఆదరాబాదరా వచ్చి "ఏమిటండీ ఇలా కూలపడిపోయారు?" అనబోయింది; కాని భర్త ముఖంకేసి చూసేసరికి ఆమె నోట్లో మాట నోట్లోనే ఉండిపోయింది. హరిహరుని కళ్ళు రెండూ జపాపుష్పాల్లా ఎర్రగా ఉన్నాయి. కుడిచెయ్యి వణుకుతున్నట్లుంది. సర్వజయ రెక్కపట్టుకుని లేవతీయబోయేసరికి అతడు మగతలో ఉండే-"అబ్బాయి ఎక్కడా? అబ్బాయి" అని అడిగాడు.

సర్వజయ ఒంటిమీద చెయ్యివేసి చూసింది, ఒళ్ళు కాలిపోతుంది. రెక్క పుచ్చుకుని నెమ్మదిగా లోపలికి తీసుకెళ్ళి పక్కమీద పడుకోపెట్టిందతడ్ని. "అప్పూ రాగానే పెనఉండే నందబాబు వాడ్ని పిలు



# పథేర్ పాంచాలి



చుకుని వెళ్లాడు. బహుశా ఈసందు మలుపులోవాళ్ల దుకాణం దగ్గర కెళ్లి కూర్చుని ఉంటాడు" అని చెప్పిందామె:

అపూ దుకాణానికి వెళ్లలేదు. నందబాబు డాబామీద పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాడు. నందబాబుకి అపూతో నేస్తమయి నెల్లాళ్లయింది. నందబాబు వయసెంతో తెలుసుకోగలిగినంత ఊహ వాడికిలేదు, కాని తనతండ్రికంటె చిన్నవాడని మాత్రం తోస్తుంది. మేడమీద నందబాబు గదిలో చాలా పుస్తకాలుండటం గమనించాడు వాడు. నందబాబు ఇంట్లో ఉంటే, వాడేదో ఒక పుస్తకం తీసుకుని పైన డాబామీద చదువుకుంటూ కూర్చుంటాడు. కాని అతడొచ్చి ఎక్కడ పుస్తకం లాక్కుంటాడో అని భయంగానే ఉంటుంది, ఎంచేతంటే ఓ మారు అలా జరిగింది. డాబామీద ఓ మూల ఎండలో అపూ పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాడు. నందబాబు ఇంట్లో ఏమిటో వెతుక్కుంటూ వెతుక్కుంటూ బయటికి వచ్చి, అపూని చూసి, అరే, అక్కడ పెట్టుదాన్ని ఎప్పుడూ కూర్చుని పుస్తకాలు చదవటమే నీకు, ఎక్కడవస్తువు ఎక్కడ పెట్టిందీ తెలియదు, అంచేత అవసరమొచ్చినపుడు ఎంతవెతికినా కనపడదు. వెళ్లు ఆ పుస్తకం అక్కడ పెట్టి వెళ్ళు అని గద్దించాడు.

తాను ఇంట్లో ఇంకే వస్తువూ ముట్టుకోడు. అయినా ఎంత కోపగించను తిట్టటం! అప్పటినుంచీ ఏ పుస్తకమయినా భయభయంగానే తీసుకుంటూ ఉంటాడు.

నందబాబు సాయంత్రమప్పుడు మంచి గుడ్డలు కట్టుకుని, సీసాలోంచి ఏదో వాసనేసేది తీసి రాచుకుని, తిరిగిరావటానికి వెడుతూంటాడు. అటువంటి ఓ రోజున సీసా తీసి అపూ ఒంటికి కూడా రాశాడు, ఒకటే ఘుమఘుమ!

వాడు మొదట్లో సందె పడ్డాక కూడా నందబాబు గదికి చదువుకోటానికి వెళ్ళేవాడు. కాని చీకటి పడ్డాక అతను అలమరలోంచి ఓ సీసా తీసుకుని, ఎర్రగా మందులా ఉండే దేదో త్రాగుతూంటాడు. ఆ సమయంలో ఓ సారి అపూ గదిలోకి వెళ్లేసరికి చాలా తిట్టాడు. నందబాబు వాటాలోకి వచ్చేందుకు మెట్లు అటునైపున. తర్వాత ఇంకొకసారి ఎప్పుడో హఠాత్తుగా పైకి వెళ్ళి చూసేసరికి నందబాబు గదిలో ఎవరో ఓ ఆడమనిషి కూర్చుని ఉంది. నందబాబు ఆమెని చూపిస్తూ, "ఈమె నా మరదలు అపూర్వ! చూసిపోదామని వచ్చింది. ఇప్పుడే వెడుతుంది" అన్నాడు. తిరిగి వస్తూంటే, అతడు మాక్రింది వాటలో ఉన్నవాళ్ల అబ్బాయి. ఏమీ ఎరుగని అమాయకుడు అని ఆ అమ్మాయితో అనటం విన్పించింది.

నందబాబు రోజూ తరచు అపూని వాళ్ళమ్మ సంగతులు అడుగుతూంటాడు "మీ అమ్మని అడిగి తమలపాకులు ఈనెలు తీయించి తెచ్చిపెడతావ్? నౌకరున్నాడు కాని, చేతకాదు వాడికి-" అనే వాడు నందబాబు.

అపూ తల్లిదగ్గర మారాంచేసి ఆకులు ఈనెలు తీయించి తరచు తెచ్చి పెడుతూండేవాడు. నందబాబు మధ్య మధ్య "మీఅమ్మ నా సంగతులూ అవీ అడుగుతూంటుందనుకుంటాను-కదూ?" అనేవాడు. అపూ ఇంటికి వచ్చాక "నందబాబు చాలా మంచివాడమ్మ, రోజూ అడుగుతూంటాడు నిన్ను గురించి-" అన్నాడు.

"నన్ను గురించా? నన్ను గురించి ఏమడిగాడు?"

"నేను ఆమెని గురించి అడిగానని చెప్పు అన్నాడు-చాలా మంచివాడు-"

"అడిగితే అడిగాడులే-నువ్వొక్కటి తుంటరి వెధవ్వి-లేకపోతే ఎందుకూ అన్నిసార్లు పైకి అతడిగదికి వెళ్లటం? సాయంత్రం అక్కడ కూర్చుని ఏంచేస్తూ ఉంటావ్?"

హరిహరునికి జ్వరం కొస్త తగ్గింది. అపూ స్కూలు నుంచి వచ్చి పుస్తకాలు గూట్లో పెట్టుకుంటున్నాడు. అడుగుల సవ్వడి విని హరిహరుడు-"అబ్బాయ్: ఇలా రారా, వచ్చి కాసేపు కూర్చో నాయనా!" అన్నాడు.

అపూ వచ్చి కూర్చుని స్కూలు కబుర్లు చెప్పటం మొదలెట్టాడు. నవ్వుతూ నెమ్మదిగా- "స్కూలుకి వెళ్లటం మొదలెట్టి రెండు నెల్లయిందిగా నాన్నా: అప్పుడే అందరికీ నేనంటే యిష్టం. రోజూ ఫస్టు అవుతున్నాను నేను స్కూల్లో. మా క్లాసులో వాళ్లంతా కలసి ఓపత్రిక అచ్చువేస్తారు ఓ నెల్లాళ్ళలో. నన్నుకూడా ఆ సంఘంలో చేర్చుకున్నారు. అచ్చు కాగానే నీకది చూపిస్తా నాన్నా!" అన్నాడు.

హరిహరుని హృదయం అపేక్ష - అంతఃకరణతో అదోలా అయిపోయింది. అపూ ఓ కాయితం పైకి తీసి, "నేను రాశాను ఇది. వాళ్లు అచ్చు వేయిస్తామన్నారు నా పేరుతో. కాని రెండేసి రూపాయలు చందాయిచ్చిన వాళ్లు రాసినవి మాత్రమే అచ్చువేయిస్తారు. రెండు రూపాయలిస్తావా నాన్నా" అని అడిగాడు.

హరిహరుడు ఎంతో ఉత్సుకతతో కొడుకు చేతిలో కాయితం తీసుకుని చదవటం మొదలెట్టాడు. కొడుకు రాయగలడన్న సంగతి తెలియదతనికి. రాజపుత్రుని మృగయా వినోదపు కథ. చక్కగా అల్లాడా కథ హరిహరుడు సంతోషించి, బాలీసుకి చేరగిలపడి కూర్చుని—"నువ్వు రాసిందేరా?" అని అడిగాడు.

"నేనింకా యెన్ని రాశాననీ! దయ్యాల కథలు, రాజకుమార్తెల కథలు—మనయింటి దగ్గిరఉండగా రాణూదీ పుస్తకంలో రాసి పెడుతూ ఉండేవాణ్ణిగా—"

డబ్బు సంగతి విని సర్వజయ ఇవ్వనీయలేదు. భర్త సుస్తీగా ఉంటున్నాడు, యీ స్థితిలో ఉన్నంతలో ఖర్చు సరిపెట్టుకోవడం కష్టం. అచ్చు వేయించాల్సిన అగత్యంలేదు. హరిహరుడామెని సమాధానపరచి—"వెళ్ళి ఇయ్యి. పాపం. వాడు రాసింది అచ్చు అయి రానీయ్. కొస్తలేచి పథ్యం పుచ్చుకున్నానంటే గళ్ళో పురాణం మామూలు ఉండనే ఉందిగా! దానిమీద పది రూపాయలు వస్తాయి"—అన్నాడు.

రెండు రోజులు పోయాక అపూ దిగాలుపడ్డ ముఖంతో, వణికిపోతున్న పెదవులతో

## (నిప్పు) రణం!

సోవియట్ రష్యా 'రెండవ స్పుత్నిక్'ను ఎగరేసిన రెండో రోజున ఆ గోళం మూలంగా బొంబాయి శ్రీ సౌండ్ స్టుడియోలో చిన్న సైజు గంద్రగోళం జరిగింది. ఆ రోజున సెట్ మీద దాక్షిణాత్య నాట్యతార పద్మిని నృత్యం 'షూట్' చేస్తున్నారు. అంతలో ఒకానొక మహానీయుడికి, ఆకాశమార్గాన లాకాపిలాటి దోటి కనబడింది. అది నిశ్చలంగా పోతోంది. దాని వెనక తెల్లటి పొడుగుపాటి తోక. అమడ పొడుగున్నట్టుంది. ఓ నిముషం ప్రశాంతంగా ఆలోచించి, చురుగ్గా నిర్ణయించేసేసి, తక్షణం "అయ్యబాబోయ్" అన్నమాటకు హిందీ తర్జుమాను గాఠ్ఠిగా గొంతు చించుకొని ప్రపంచించాడు.

## బొంబాయి లేఖ

చాలా హడావుడిగా అతనిచుట్టూ మహాసభ జరిగింది. అందరూ ఆకాశం కేసి చూసి, మొదటి పెద్దమనిషి వరవడిని శిరసావహించి అదేరకం ప్రకటనలు చేశారు. ఆ సభాధ్యక్షుడు ఎవరోగాని, 'అది రష్యన్ రాకెట్' అన్నాడు.

'ఇంకేముంది' అన్నారు చాలామంది. గంద్రగోళం చెలరేగింది. అంతలోకి పద్మిని సెట్ మీదనుంచి ఇవతలికివచ్చి పైకిచూసి, పకపకనవ్వి, అది రాకెట్ కాదు. స్పుత్నిక్ అంతకన్నా కాదు. జెట్ విమానం. మనదే. తెలీటంలేదా?" అంది. అప్పుడందరు స్థిమిత పడి చూచి,—

అంతే. ఆకథ అయిపోయింది. కట్టుకథ అని మాత్రం అనుకోకండి.

### "స్పుత్నిక్ 1957"

అలాంటిదే, రెండో స్పుత్నిక్ కథ ఒకటి చెలామణీలో ఉంది. అంటే రెండో స్పుత్నిక్ గురించినదికాదు. స్పుత్నిక్ గురించిన రెండో కథ.

ఐదారుగురు పెద్దమనుషులు ఆదరాబాదరా ఊరంతా గాలించి, హడావుడిగా అశోక్ కుమార్ ఇంటికొచ్చి "దొరకలేదు." అన్నారు.

"ఏమిటి?" అన్నాడు అశోక్ కుమార్.

"అదే. ఆ స్పుత్నిక్ కారు. ఊళ్లో కార్ల దుకాణాలన్నీ గాలించాం...ఎక్కడా లేదు. ఎక్కడడిగినా నేను కనలేదు వినలేదు అని ఆశ్చర్యపోతున్నాడు. వెర్రి వెధవలు...ఎందుకు. కార్ల వ్యాపారం చేస్తున్నవాళ్లికి, లేటెస్ట్ మాడల్ కారు గురించి తెలీపోతే ఎలా?" అన్నారు వాళ్ళు.

అశోక్ కుమార్ వాళ్లమాటలు సాంతం శాంతంగా విని, గంభీరంగా పైపు ముట్టించి "రైటే. వాళ్లు చెప్పింది రైటే. నేనూ ఎక్కడా వినలేదు "స్పుత్నిక్" అనే కారు ఉందని" అన్నాడు.

"మరి మీరే చెప్పారుగా?" అన్నారు ఆ వచ్చిన వాళ్ళు ఆశ్చర్యపడిలేచి...

అశోక్ కుమార్ కొంటెగా నవ్వాడని ఈ కథకి చివర రాయొచ్చుగాని, దొరల భాషలో అది కుంటిగా ఉంటుంది—అంటే 'లేమ్ ఎండింగ్' అవుతుంది.

## ఆఫ్రికాలో గోపీకృష్ణ

ప్రసిద్ధ కథక్ నర్తకుడు గోపీకృష్ణ (ఝనక్ ఝనక్ పాయల్ బాజే) తూర్పు ఆఫ్రికాలో పర్యటనకై గతవారం బయలుదేరి వెళ్లాడు. ఆయనతోపాటు వాద్యబృందం, నర్తకులూ కూడా వెళ్లారు. ముఖ్య



'నాగమణి' చిత్రంలో నిరూపరాయ్



...రసరాజు & కంపెనీవారి "తలవంచని వీరుడు" చిత్రంలో దేవసుందరి (సావిత్రి), చిత్రసేన (శివాజిగణేశన్)

## బొంబాయి సినిమా లేఖ

...ద్రకి మోహిని ఈ బృందం అక్కడ మూడుమాసాలు పర్యటించి, మొత్తం 60 ప్రదర్శనలిస్తుంది

### అమెరికా ఆహ్వానం

'అమెరికన్ మోషన్ పిక్చర్ అకాడమీ' ఏటా విదేశీయచిత్రాలలో ఒకదానిని ఎన్నికచేసి, బహుమతిని ఇవ్వడం విదితమే. ఈ ఏడాది, మనదేశాన్ని కూడా ఆపోటీలో పాల్గొనవలసిందిగా వారు ఆహ్వానించారు. గత డిసెంబరునుండి ఈ డిసెంబరులోగా విడుదల అయ్యే చిత్రాలను మాత్రమే పోటీకి అర్హంగా పరిగణిస్తారు. బహుమతి ప్రదానం మార్చి నెలలో జరుగుతుంది కాగా, బహుమతిని చిత్రం పేరిటనే ఇస్తారు తప్ప, వ్యక్తులకు కాదు

### చిన్న సన్మానం

నర్గీస్‌కు అత్యంత ఆప్తులైన కొద్దిమంది బంధుమిత్రులు శ్రేయోభిలాషులు మొన్న చిన్న సన్మానంలాంటిది చేశారు "మదర్ ఇండియా చిత్రంలో అంతబాగా నటించినందుకు ఎంతగా మెచ్చుకోవాలో మాకు తెలీటంలేదు" అంటూ వాళ్ళంతా కలసి ఒకచక్కని దీపపు సమ్మెను ఆమెకు కానుకగా ఇచ్చారు ఆర్భాటం లేకుండా, ఆవిందు సభ జరిగిపోయింది

### నయా(ర్) బేటీ

సంగీత దర్శకుడు ఓ పి నయ్యార్ ఒక పందెంలో ఓడిపోయాడు మొన్న మొన్నటి వరకూ, 'ఈసారి నాకు కొడుకు పుడతాడు' అని మిత్రులతో ధాటీగా చెబుతూవచ్చాడు అందరూ, 'ఔనుమరే, కొడుకే పుట్టాలి' అని అన్నా, గాయని ఆశా భోంస్లే 'కాదు కూతురే పుడుతుంది' అని వాదించి పందెం కట్టింది చివరకి ఆమె నెగ్గింది. నయ్యార్‌కు మళ్ళీ కూతురే పుట్టింది నాన్నకి టోకరా ఇచ్చిన ఈ 'నయా బేటీ', నయ్యార్‌కు మూడవకూతురు.

* * *

బొంబాయి చిత్రసీమలో ఫిలిం నటీనటుల తోపాటు వారి పిల్లల పుట్టిన రోజులుగూడా ఝామ్మని, 'గ్లామరస్' అనిపించుకునేలా జరుగుతున్నాయి. మొన్న, గాయకుడు, (నటుడు) తలత్ మహమూద్ కుమారుడు ఖలీల్‌కు నాలుగో పుట్టినరోజు పండుగ వైభవంగా జరిగింది అగ్రశ్రేణి నటీనటులందరూ విందుకువచ్చి ఖలీల్‌ను ఆశీర్వదించి, కానుకలిచ్చారు అంతక్రితం సంగీతదర్శకుడు మదనమోహన కుమారుడు సంజీవ్ పుట్టినరోజు పండుగ చేసుకున్నాడు.

### నవ్‌రంగ్

రాజ్‌కమల్ కళామందిర్ పేరిట దర్శక నిర్మాత శాంతారాం ఈసారి హిందీతో పాటు తెలుగులోకూడా ఒకచిత్రం నిర్మించ నిశ్చయించారు హిందీచిత్రానికి 'నవ్‌రంగ్' అని పేరుపెట్టారు.

రెండు చిత్రాలలోనూ నాయిక భూమిక కను నర్తకి సంధ్య నిర్వహిస్తుంది

* *

బ్రిటన్‌లో సినిమా యజమానులంతా ఇటీవల సమావేశమై ప్రవేశ రుసుము పెంచాలని నిశ్చయించారు.

* * *

ఏడాదినాడు, అమెరికన్ నటి అవా (భవానీ జంక్షన్) గార్డ్నర్ ఈ ఊరొచ్చింది. అప్పుడావిడ, తన కూడా పెక్లే

చేటాతోపాటు, ఒకజత 'ఇనప తెరలు' తెచ్చుకుంది ఈమాట అందరూ అన్నారు. తలోట్లో. ఈ "ఇనపతెరలు" అమెరికా ఓప్పయారయ్యాయి కాబోలన్నారు వెటకారంగా కొందరు. కారణం అవా గార్డ్నర్ వాలకం. ఆమె అప్పుడు 'భవానీ జంక్షన్' చిత్రం షూటింగులో పాల్గొనడానికై కరాచీ వెళ్తూ, బొంబాయిలో రెండు గంటల సేపు ఆగింది. పత్రికా విలేఖరులు, ఫోటోగ్రాఫర్లు, ఎంతో ఉత్సాహంతో ఆ ప్రఖ్యాత అమెరికన్ నటిని పలకరించబోయారు తీరా చూస్తే ఆవిడ పెద్ద నల్లకళ్ళజోడు తగిలించుకుని చిర్రూబుర్రూమంటూ కనపడింది. అప్యాయంగా, ఎంతో గౌరవంగా విలేఖరులు అడగబోయిన ప్రశ్నలకు జవాబు లివ్వలేదు. సుహృద్భావం పెంచే లక్షణాలకు బదులు, ఇదేమి వైఖరి అని అంతా విస్తుపోయారు. కొందరు నొచ్చుకున్నారు...

ఆ రోజున, ఎవరూ పడమటవేపుకి తిరిగి 'వన్స్‌మోర్' అని అనలేదు.. కాని, మొన్న నవంబరు 7వ మరొక అమెరికన్ నటి జెనిఫర్ (పోర్ట్రెయిట్ ఆఫ్ జెన్నీ, లవ్ ఈజె మెనీ స్ప్లెండర్డ్ థింగ్) జోన్స్ అదే వైఖరిని పునః ప్రదర్శించింది. ఈమె, ఆమెను మించిపోయిందనిపించింది చిరచిరలాడటంలో. ఈమె వసుందని తెలిసి విలేఖరులూ, ఫోటోగ్రాఫర్లూ శాంతాక్రజ్ విమానాశ్రయానికి వెళ్ళారు స్వాగతం చెబుదామని. ఆమె వీళ్ళనుచూచి చిరాకు నటించింది. గాలి గట్టిగా వీస్తున్నందువల్ల నేమో అనుకుని, విలేఖరులు అక్కడనుండి ఆమె బసచేసిన తాజ్‌హోటల్‌కి వెళ్లారు.

సినిమాస్టార్లు ముఖ్యంగా హాలీవుడ్ వాళ్ళు, "చిరునవ్వులు తొడుక్కుంటారని," కొందరంటారు. ఆరోజున తాజ్ హోటలులో జెనిఫర్ దగ్గిర చిన్నసైజు చిరునవ్వుకూడా లేకపోయింది. ఈ దేశం వచ్చేసరికి అయిపోయాయి కాబోలు. కసిరినట్టు మాట్లాడబోయింది. ఆరకం వాలకం, మనదేశంలో నాగరికులు, సభ్యత తెలిసినవాళ్లు కూడా ఏ చోటా మనకి కనబడరు. మనకి అలాటిది అలవాటు లేదు.

జెనిఫర్, అక్కడ్నించి, మళ్ళీ విమానం ఎక్కి ఢిల్లీ వెళ్ళింది ఓనెల్లాళ్ళపాటు ఇండంబటే ఉండి విశ్రాంతి తీసుకుంటుందట. ఇది కబురో, పుకారో తెలీదు. ఆవిడ ఏదైనా ప్రత్యేకమైన మహాత్కార్యం భుజాన వేసుకొచ్చిందేమోకూడా తెలీదు. కానీ, ఆ చిరాకుపడటం అదిచూడగా, మనకు తెలియరాని రాచకార్యం కాబోలు, బహుశా మనకది నచ్చనిది కాబోలు, అందుకే చిరాకు పోలేదు అని ఊహపోతుంది ఒకవేళ ఏదేనా ఫిలిం వ్యవహారంమీద నే వచ్చినా వచ్చివుండవచ్చును. ఏమైనా, అది వేరేసంగతి. ఈ దేశం వచ్చిన అమెరికన్‌లు ఈ ఇద్దరే కారు. ఇంతకుముందు చాలా మంచివాళ్లు, సౌమ్యులు వచ్చారు. ఇక్కడ విశ్రాంతి తీసుకున్నారు; అనేకరాచీలో మజిలీ చెయ్యనూచేశారు వాళ్లంతా, మనదేశంలోని కాశ్మీరు ప్రభృతి ప్రాంతాలలో స్థితిగతులు చూచి, తెలుసుకుని, తమ రాచకార్యం మేరకు ఆభోగట్టాను కరాచీ రవాణా చేయనే చేశారు. జెనిఫర్ జోన్స్ రాచకార్యం కూడా ఆకోవదేనా అన్న విషయంలో ఎవరికి తోచినది వారు అనుకోవచ్చు.

నటి నూతన సమర్థ్ లండన్‌లో భారత చలన చిత్రోత్సవం అయిపోయాక, స్విట్జర్లాండ్ వెళ్లి నెల్లాళ్లు విశ్రాంతి తీసుకు తిరిగివచ్చింది మళ్ళీ ఓ కుక్కని పట్టుకు చక్కావచ్చింది. యూరప్ వెళ్లివచ్చినప్పుడల్లా, కుక్కపిల్లని పట్టావటం ఆమెకు అలవాటే. ★

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)



ఇటీవల దిలీప్‌కుమార్ డార్జిలింగ్ వెళ్ళినప్పుడు అక్కడివారు విందు చేశారు. ఎడమ చివరఉన్నవారు బి. ఆర్. చోప్రా.

చైనా రాజధాని 'పెకింగ్' నగరంలో ఇటీవల జరిగిన ఆసియా చలనచిత్రోత్సవానికి సొహ్రాబ్ మోడీ సతి శ్రీమతి మెహతాబ్ భారతప్రతినిధిగా వెళ్లారు. ఆమెతో వున్నవారు చైనీస్ నటి పెన్ రయున్.



# చలన చిత్రాలలో నటన

## అంజలీదేవి అభిప్రాయాలు

['వాయిస్ ఆఫ్ అమెరికా'లో గోష్ఠి]

ఖాన్ :-నమస్కారమండి అంజలీదేవి గారు.

అంజలి :-నమస్కారమండి.

ఖా :-వాయిస్ ఆఫ్ అమెరికా ద్వారా మిమ్మల్ని పరిచయం చేస్తున్నందుకు చాలా సంతోషంగా ఉందండి.

అ :-ఈ అవకాశం కలిగించినందుకు నాకూ అలాగే వుందండి.

ప్రశ్న :-మీరు మొట్టమొదటగా నటించిన చిత్రమేదండి.

జవాబు :-గొల్లభామ.

ప్ర :-అందులో మీరు చాల చక్కగా నాట్యం చేశారు. అంతకు పూర్వం, మీరు నాట్య శాస్త్రంలో శిక్షణేమయినా పొందారా?

జ :-శిక్షణ అంటే, నా చిన్నతనంలోనే మావాళ్ళు నాకు నాట్యం నేర్పించారు. ఆ కళయందు ఎక్కువ ఉత్సాహముండటంచేత, ప్రతిరోజూ అమిత శ్రద్ధతో, నాట్యం చేస్తూండేదాన్ని. ఇంతలో, యుద్ధనిధి సహాయార్థం, కొన్ని నాట్య ప్రదర్శనాలని ఇవ్వమని నన్ను కోరడంచేత, ఈ కళను నవ్యరీతుల్లో దినదినాభివృద్ధి చేసుకోగలిగాను.

ప్ర :-అంటే ముఖ్యంగా 'స్వయంకృషి' అనే చెప్పాలి. నాట్యమందు మంచి పేరు ప్రఖ్యాతులు తెచ్చుకోవడమే కాకుండా 'పల్లెటూరి పిల్ల' 'నిర్దోషి' మొదలగు చిత్రాల్లో ఉద్వేగ భరితమయిన పాత్రలను, ఉత్తమంగా నటించారు. మీకు నాట్యంలో అనుభవంతోపాటు, రంగస్థల అనుభవం కూడా ఏమయినా వుందా?

జ - నేను మద్రాసు రాక పూర్వం .. ఆంధ్రదేశంలో చాలా చోట్ల నాటకాల్లో కూడా నటించినా ఈ నటనలో అటు ఖులాసా అయిన పాత్రలూ ఇటు 'బరువైన' పాత్రలు వేస్తుండేదాన్ని.

ప్ర -మీకు చిత్రాల్లో నటించడంతో పాటు రంగస్థలంమీద అనుభవంకూడా ఉన్నదన్న మాట ఈ రెండు తరహాల నటనలకు ఏమైనా వ్యత్యాసం వుందాండి.

జ -చాలా వ్యత్యాసం వుందండి. రంగస్థలంమీద నటించేప్పుడు ప్రక్కనున్న నటీనటుల సహకారం ప్రేక్షకుల రసానుభూతి ఎంతో సహాయంగా వుంటాయి. కాని చిత్రాల్లో అదే దృశ్యాన్ని చిత్రించేటప్పుడు 'షాట్స్'గా విభజిస్తారు. ఒక్కొక్క షాట్ మధ్యని, కాలవ్యవధి కనీసం అరగంట నుంచి, గంటవరకు వుంటుంది. కనుక మొదట ఏభావంతో నటించామో, అదే భావాన్ని తర్వాతి షాట్‌లోకూడా ప్రదర్శించాలి లేకపోతే నటనలోని 'కంటిన్యుటి' దెబ్బతిని, రసాభాసవుతుంది.

ప్ర -మరేనండి సాధారణంగా మీలో రంగస్థలం మీదికి వచ్చేటప్పుడు, మీ పాత్ర వంతా, కంఠస్థం చేస్తేనే ప్రాంప్టింగ్ లేకుండా, చక్కగా నటించడానికి వీలవుతుంది. అలాగే, చిత్రాల్లో షూటింగ్‌కి వెళ్ళే



ఫిలింస్ డివిజన్‌వారు మలయాళకవి వల్లత్తోల్ పర్యవేక్షణక్రింద, 'కథాకళి' నృత్యవిద్యపై ఒక 'చిన్నచిత్రం' నిర్మిస్తున్నారు. అందులో నృత్యం చేస్తున్న కుంజుకురూప్, కుమారివాసు.

ముందుకూడ, మీ పోర్షనంతా కంఠస్థం చేసుకుని వెళ్తారా.

జ:-కంఠస్థం అంటే నాటకాల్లోలాగా బట్టీపట్టి వెళ్లను. కాని, ఆ పాత్ర ఏమిటో, ఆ డైలాగ్స్ ఏ విధంగా చెబితే భావయుక్తంగా ఒప్పుతాయో, బాగా ఆలోచించుకుని, అవగాహన చేసుకుని మరీ సెట్ మీదికి వెళ్తాను. కాని కొందరు ప్రొడ్యూసర్స్ సెట్ మీదనే డైలాగ్స్ ఇస్తూంటారు. అక్కడే వాటిని చదువుకుని వెంటనే 'మూడ్'లోకి వెళ్ళి, నటించాలని వస్తుంది.

ప్ర:-షూటింగ్ అంటే, మీరు ప్రతిరోజూ ఒకే కాల్ షీట్ పనిచేస్తారా, లేక రెండు మూడు కాల్ షీట్స్ పని చేస్తూంటారా?

జ:-ప్రతిరోజూ ఒకే కాల్ షీట్ కి పని చేస్తే ఎంతో హాయిగా వుంటుంది. కాని ఎక్కువ పిక్చర్లవల్ల, రోజుకి రెండు కాల్ షీట్స్ కూడా పనిచేస్తూంటాను.

ప్ర:-శారీరకంగాను, మానసికంగాను ఇది శ్రమయిన పనేకదా?

జ:-అవునండి.

## పరకాయ ప్రవేశం

ప్ర:-ఉదయం ఒక కాల్ షీట్ అంటే సుమారు 7 గంటలకాలం పని చేసారు, మధ్యాహ్నం నుండి రెండో కాల్ షీట్ పని చేస్తారు. అంటే కొద్దిపాటి విశ్రాంతితో ఒకపాత్ర నుంచి, మరో పాత్రలోకి పరకాయ ప్రవేశం చేసినట్లుంటుంది కదూ?

జ:-అందుకనే కాల్ షీట్స్ మధ్య తగినంత వ్యవధి ఉండేటట్లు చూస్తూంటాను. ఒకసారి 'రిలీజ్ డేట్' ఇచ్చిన పిక్చర్స్ అయితే, రాత్రింబగళ్ళు పని చేయాలసి వస్తుంది. కాని, నటనయందు గల శ్రద్ధాభక్తులూ, నిర్మాతలకు సహాయం చేయాలనే ఆవేదనా, నా శ్రమనుకూడా లెక్క చేయకుండా చేస్తాయి.

ప్ర:-మీరూ ప్రొడ్యూసర్ కనుక, ఆ సాధక బాధకాల్ని సులువుగా గ్రహించగలుగుతారు. ఇంకో ప్రశ్న అండి, అంజలీదేవిగారూ

జ:-అడగండి మోహన్ గారు...

ప్ర:-ప్రతిరోజూ కనీసం 16 గంటలయినా పనిచేసే మీలాంటి వ్యక్తులకు, కనీసం వారానికి ఒకరోజయినా విశ్రాంతివుండటం చాలా అవసరమనుకుంటాను.

జ:-నిజమేనండి. ప్రతి ఆదివారం, ఈ చిత్రకళాప్రపంచాన్ని మరిచిపోయి ఎక్కడికయినా వెళ్లివద్దామనిపిస్తుంది... కాని అది జరగదు.

ప్ర:-ఇలా సహకరించే నటీనటులు చాలా అరుదుగా వుంటుంటారు. మీరింతవరకు ఎన్ని చిత్రాల్లో నటించివుంటారు.

జ:-విడుదలయిన చిత్రాలు అరవైఅయిదు. ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు ముప్ఫయిఒకటి. మొత్తం తొంభైఆరు చిత్రాలు. ఇటీవల సారథి వారిచిత్రం "పెద్దరికాలు"; నా స్వంత చిత్రం తెలుగు 'సువర్ణసుందరి' తమిళం 'మణాలన్ మంగయిన్ భాగ్యం' మొదలగునవి విడుదలయాయి.



యన్. ఏ.టి. వారి "పాండురంగమాహాత్మ్యం"లో రామారావు, బి. సరోజ



విజయగోపాల్ ప్రొడక్షన్స్ వారి "గంగా గౌరీ సంవాదం" చిత్రంలో గంగన్న కన్నతల్లిగా హేమలత

ప్ర:-మీరు నటించిన చిత్రాల్ని మీరు చూస్తుంటారా.

జ:-నేను నటించిన చిత్రాల రషెస్ మాత్రం అప్పుడప్పుడు చూస్తుంటాను. చిత్రం పూర్తిఅయినతర్వాత చూడ్డానికి ముఖ్యంగా తెలుగుచిత్రాలు ఇక్కడ ఎక్కువగా విడుదల కాకపోవడమే కారణం. "ప్రివ్యూ" కయినా వెళ్దామంటే 'కాల్ షీట్స్' ఆ కాస్త అవకాశాన్ని మింగేస్తాయి.

ప్ర: రషెస్ చూడటంవల్ల మీకేమయినా లాభం వుంటుందా?

జ:-తప్పకుండా లాభముంటుంది. నేను నటించిన పాత్రకు న్యాయంచేశానో లేదో అని ముందు ఆలోచిస్తాను. సెట్ మీద నటిస్తూన్నప్పుడు, తెలియని కొత్త విషయాలు రషెస్ చూస్తూంటే కనిపిస్తుంటాయి.

ప్ర:-మీ అభిమాన ప్రేక్షకులనుంచి వచ్చిన ఉత్తరాలికి జవాబులిస్తుంటారా!

జ:-అవకాశం ఉన్నంతవరకు ఉత్తరా

# సినిమా వార్తలు

అన్నపూర్ణా(తోడికోడళ్ళు) పిక్చర్స్‌వారు ఈ వారంలో కొత్తచిత్రాన్ని ఆరంభిస్తున్నారు. నవంబరు రెండో వారాంతానికి స్క్రిప్టు రచన పూర్తిచేసినట్లు, నిర్మాత డి. మధుసూదనరావు తెలియజేశారు. 28న పాటల రికార్డింగు ఆరంభిస్తారు. డిసెంబరు మూడో వారంలో "షూటింగ్" మొదలుపెడతారు. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, సావిత్రి ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రంగారావు, కన్నాంబ, రేలంగి, సూర్యకాంతం, రాజసులోచన ప్రముఖ పాత్రలు ధరిస్తారు.

కొత్త నటుడు రమణ (ఎం. ఎల్. ఎ.) మూర్తిని మధుసూదనరావుగారు ఇటీవలనే బుక్ చేశారు. స్ఫురద్రూపం, సౌలభ్యం ఒప్పే నటన రమణమూర్తిని సర్వత్రా అభిమానపాత్రుణ్ణి చేశాయి. నిర్మాత మధుసూదనరావు ఇపుడు రమణమూర్తికి ఈ కొత్త చిత్రంలో ఒక మంచి భూమికను అప్పగించారు.

శతదినోత్సవ చిత్రం "తోడికోడళ్ళు" రూపొందించిన టెక్నిషియన్ల బృందము అంతా ఇందులో పాల్గొంటున్నది. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, మాటలు ఆత్రేయ, పాటలు ఆత్రేయ, శ్రీశ్రీ, కొసరాజు వ్రాశారు. సంగీత దర్శకుడు పేణు. కళాదర్శకుడు కృష్ణారావు. ఈ చిత్రాన్ని తెలుగులోను నిర్మిస్తున్నారు.

## తలవంచని వీరుడు

శరవణభవ అండ్ యూనిటి పిక్చర్స్‌వారి 'రణంగాముడి' చిత్రాన్ని నరసరాజు అండ్ కంపెనీవారు 'తలవంచని వీరుడు' పేరిట వచ్చేనెల తెలుగులో విడుదల చేస్తున్నారు. మాటలు పాటలు శ్రీశ్రీ వ్రాశారు. తమిళనాడులో విజయవంతంగా సాగిన ఈ చిత్రంలో సావిత్రి, శివాజీగణేశన్, కన్నాంబ, రాజసులోచన, హెలెన్, నాగయ్య, నంబియార్, హాస్యనటుడు తంగవేలు పాల్గొన్నారు. దర్శకత్వం పి. పుల్లయ్య.

## పొన్నలూరివారి కొత్తచిత్రం

పొన్నలూరు బ్రదర్స్‌వారి సాంఘిక చిత్రం 'శోభ'ను సంక్రాంతికి విడుదల చేయాలని సంకల్పించారు. వీరి తరువాతి చిత్రం 'దైవబలం' నిర్మాణం (తెలుగు, తమిళ భాషలలో) డిసెంబరులో ఆరంభిస్తున్నారు. రచన పూర్తి అయింది. ఇది జానపదం.

నాలుగవ కానుకగా హాస్యరస ప్రధానమైన ఇతివృత్తాన్ని తీసుకొని 'గుడ్ మార్నింగ్' పేరిట నిర్మించనున్నట్లు నిర్మాత వసంతకుమార రెడ్డి ప్రకటించారు.

## చలన చిత్రాలలో నటన

లకు జవాబులిస్తూనే వుంటాను. కాని అన్ని ఉత్తరాలకు సమాధానాలివ్వాలంటే మానవమాత్రులకు సాధ్యంకాదు. ఈ విషయంలో మీరుకూడా నాతో ఏకీభవిస్తారనుకుంటాను.

ప్ర.—మరేనండి, ప్రేక్షకులుకూడ ఈ విషయాన్ని గ్రహిస్తారనుకుంటాను. ఇంకో ప్రశ్న. మీరు తెలుగు, తమిళ చిత్రాల్లో కేనా, మరే భాషా చిత్రాల్లోనయినా నటించారా?

జ.—హిందీ చిత్రాలలోకూడా నటించానండి. 'ఏక్-థా-రాజా', లడ్కీ, షుక్-రంభ, నయా ఆద్మీ, దేవత'ల్లో నటించాను. ప్రస్తుతం 'ఉస్తాద్'లో నటిస్తున్నాను.

మోహన్.—మీకు వ్యవధి లేకపోయినా, శ్రోతలమీది అభిమానంతో ఈ కార్యక్రమంలో పాల్గొన్నందుకు అభినందిస్తున్నాను.

అం.—నాకీ అవకాశం ఇచ్చినందుకు చాలా సంతోషం.

మో.—శెలవండి.

అ.—శెలవండి. ★

## *వద్దంటే పెళ్ళి*

విఠల్ ప్రొడక్షన్స్‌వారి హాస్యరస ప్రధాన చిత్రం "వద్దంటే పెళ్ళి" గతవారం ఆంధ్రలో విడుదల అయింది. శ్రీరంజని, కృష్ణకుమారి, గిరిజ, ఇ. వి. సరోజ, అమర్‌నాథ్, చలం, సి. ఎస్. ఆర్., రమణారెడ్డి, రాజనాల, పేకేటి శివరాం, బాలకృష్ణ, మొదలగువారు ఇందులో పాల్గొన్నారు. రచన రామచంద్, జి. కె. మూర్తి. దర్శకుడు విఠలాచార్య.

## ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్

ఇటాలియన్ దర్శకుడు రాబర్టో (వైజా, పారింబాలీ) రాసెలినీ, నటి ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్ విడాకులు ఇచ్చుకున్నారు. ఏడేళ్ళ కాపరం తరువాత, ఒకరి తత్వం ఒకరికి పొసగదని ఇపుడు చట్టరీత్యా తేల్చుకున్నారు. రాసెలినీ అమధ్య మనదేశం రావడం, ఆయన బొంబాయిలోని సొనాలీ అనే గృహిణిని ప్రేమించాడని వదంతులు, వాటి మూలంగా కొంత రభస రేగడం విదితమే. తరువాత రాసెలినీ ఇటలీ వెళ్ళిపోయారు. వెళ్ళిన వారంరోజులకు (ఈ నెల రెండో వారం) భార్యాభర్తలు వేరైనట్లు ప్రకటన వెలువడింది. ఈ దంపతులకు ముగుగు పిల్లలు. ★

## ఆంధ్రవిద్యార్థి సమితి సాంస్కృతికోత్సవాలు

మద్రాసు ఆంధ్రవిద్యార్థి సమితి సాంస్కృతి కోత్సవాలు నవంబరు 7 నుండి 11 వరకూ జరిగాయి. ఉత్సాహం వెల్లివిరిసిన



పొన్నలూరి బ్రదర్స్‌వారి "శోభ" చిత్రంలో అంజలీదేవి, రామారావు, కొండలరావు

ఈ ఉత్సవాలను లాంఛనంగా మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కె. కామరాజ్ ప్రారంభించారు. ఆనాటిసభకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు శ్రీ వి. గోవిందరాజులు నాయుడు అధ్యక్షత వహించారు.

ఏకాంకికల ప్రదర్శనం, వక్తృత్వపోటీ విషయం, గానసభలూ, నృత్య ప్రదర్శనలు మొదలగువాటన్నిటిలోను నగరంలోని వివిధ కళాశాలల ఆంధ్ర విద్యార్థినీ విద్యార్థులంతా పాల్గొన్నారు. ఈసారి విశేషం ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయాలకు చెందిన విద్యార్థి బృందాలు వచ్చి పాల్గొనడం.

## సన్మానాలు

నవంబరు 10 వ తేదీన సెంట్‌జోసెఫ్ హాలులో ఈ సమితి లలితకళా సన్మానం జరిపింది. చలనచిత్రకళాకారులలో నటుడు శ్రీ ఎన్ టి రామారావు, నటి శ్రీమతి జి వరలక్ష్మి, గాయకుడు సంగీత దర్శకుడు శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు ఉన్నారు. ఇంకా వెయిట్ లిఫ్టింగ్ చాంపియన్ శ్రీ కామినేని ఈశ్వరరావును, కవి శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డినీ కూడా సత్కరించారు. ఆరోజు సభకు చిత్తూరు నాగయ్య అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షుడు శ్రీ టి సి కోండయ్య స్వాగతం చెప్పారు.

శ్రీయుతులు కె జగ్గయ్య, డా॥ గోవిందరాజు సుబ్బారావు ప్రభృతులు సన్మానితులను ప్రశంసిస్తూ ప్రసంగించారు. శ్రీ ముదిగొండ లింగమూర్తి వివిధ పోటీలలో ఉత్తమ ప్రమాణాలు చూపిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు. సమితి కార్యదర్శి శ్రీ రామారావు వందనసమర్పణతో ఉత్సవాలు ముగిశాయి. ఈ ఉత్సవసందర్భంగా ఒక చిత్రకళా ప్రదర్శనంకూడా ఏర్పాటు చేశారు.

# దర్శక నిర్మాత రంగాకు సన్మానం

దర్శక నిర్మాత, ప్రముఖ ఛాయాగ్రహణ దర్శకుడు, అయిన శ్రీ బి ఎస్ రంగాను, నవంబరు 10 సాయంకాలం నవయుగ ఫిలింస్ వారు సన్మానం చేశారు.

శ్రీ పచ్చిపాపయ్య భవనంలో జరిగిన ఈ సభకు, విజయవాడ పురపాలన ప్రత్యేకాధికారి, కమిషనర్, శ్రీ గురురెడ్డి అధ్యక్షత వహించారు.

ముందు టేనీటివిందు జరిగింది. తరువాత నవయుగ ఫిలింస్. తరఫున శ్రీ విశ్వనాథశర్మ, సన్మానపత్రం చదివారు. ఆ పత్రాన్ని, ఒక రజత అశోక స్తంభాన్ని అధ్యక్షుడు గురురెడ్డి రంగాగారికి బహూకరించారు. శ్రీయుతులు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, ఎ బలరామమూర్తి, డి వి కృష్ణయ్య ప్రభృతులు, దర్శకుడుగా, నిర్మాతగా చలనచిత్ర పరిశ్రమకు రంగా చేసిన సేవను ప్రశంసించారు. ఆయన నిర్మించిన 'తెనాలి రామకృష్ణ' చిత్రం రాష్ట్రపతి బహుమతిని అందుకోవడం తెలుగు పరిశ్రమకు ప్రజలకు కూడా గర్వకారణమన్నారు. రంగా కృతజ్ఞత తెలుపుతు, "తెనాలిరామకృష్ణ" విజయానికి కారణం అందులో పాల్గొన్న కళాకారుల టెక్నిషియన్ల కృషిఅని అన్నారు.

ఉత్తమశ్రేణి తెలుగు చిత్రాలను అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలకు పంపడంలో ప్రభుత్వం సహాయం చాలా అవసరమని ఈ సందర్భంలో ఆయన చెప్పారు.

## రంగా పరంగా

రంగా గారు, చలనచిత్రపరిశ్రమలో ఛాయాగ్రాహకుడుగా ప్రవేశించారు. అచిరకాలంలోనే అరంగంలో పేరుతెచ్చుకొని, మద్రాసులో చిత్రనిర్మాణం ఆరంభించారు. ఒక లేబరేటరీ కూడా నెలకొల్పుకున్నారు. మా గోపి, తెనాలిరామకృష్ణ, భక్త మార్కండేయ చిత్రాలను తెలుగు తమిళ భాషలలోను, మొన్ననే విడుదల అయిన 'కుటుంబగౌరవం'ను తెలుగు తమిళ కన్నడభాషలలోను నిర్మించారు. ఈ తొమ్మిదీ నాలుగేళ్ల కాలంలో విడుదల అయ్యాయి. ఈ వ్యవధిలోనే ఆయన కోడంబాకంలో ఒక స్టుడియో నిర్మించుకున్నారు. త్వరితంగా ఏడాదికో చిత్రం (కనీసం) అందివ్వడం ఆయన లక్ష్యం. తొంగిచూచి, అందిన లాభాలు పుచ్చుకొని ఇంకో రంగంలోకి వెళ్ళే ఊహతో రంగా ఇందులోకి రాలేదు. పరిశ్రమకు చెందిన మనిషి అనిపించుకొని, స్వయంకృషితో చెప్పుకో తగ్గ ఫలితాలను సాధిస్తూ నిలదొక్కుకున్న వ్యక్తిగా సర్వత్రా అభినందనీయుడనిపించుకొన్నారు.

## కొత్తనటులకు నిర్మాతల సంఘం ప్రోత్సాహం

కొత్తనటులను ఏరి, చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశపెట్టడానికై భారత చలనచిత్రనిర్మాతల సంఘం (ఐ ఎం పి పి ఎ) ప్రత్యేకం ఒక సంస్థను ఏర్పాటుచేసింది. వీరు ఏరిచూపే నటీనటులలో, తమచిత్రాలకు తగినవారు, సమర్థులు లభించినట్లయితే, వారిని తీసుకొని అవకాశం ఇవ్వడానికి ప్రముఖ దర్శక నిర్మాతలు బి ఆర్ చోప్రా, బిమల్ రాయ్, గురుదత్, పి ఎన్ అరోరా, మోహన్ సెగాల్, ఎస్ డి నరాంగ్, ఎం సాదిక్ మొదలగువారు అంగీకరించారు.

ఇదే తరహా ప్రయత్నాన్ని సినిమాపత్రిక 'ఫిలింఫేర్' కూడా, గురుదత్, బిమల్ రాయ్‌ల సహకారంతో తలపెట్టడం విదితమే.

ఇపుడు ఐ ఎం పి పి ఎ ద్వారా, చలనచిత్రాలలో చేరగోరేవారు ఆ సంఘం



చలనచిత్ర దర్శక నిర్మాత 'విక్రమ్ స్టుడియో' అధిపతి శ్రీ బి. ఎస్ రంగాకు నవయుగ ఫిలింస్ (విజయవాడ) వారు నవంబరు 10 న సన్మానం చేశారు. ఎడమనుండి శ్రీ రంగా, బహుమతిని అందచేస్తున్న విజయవాడ పురపాలక సంఘ కమిషనర్ శ్రీ గురురెడ్డి, శ్రీ డి విశ్వనాథశర్మ

# ★ మా మ్మ నడిపిన విప్లవం ★

పదహారవ ఏటనే భర్త చనిపోయేడు. అప్పటికి గర్భంతో ఉంది ఆమె. ఒక కొడుకు పుట్టాడు. పుత్రజననం జరిగాక ఆమె అందమైన శరీరాన్ని పెద్దలు వికృతంచేశారు. శిరోముండనం చేసారు. ఆమె ఎంతో బాధపడి ఏడ్చింది తన ఆకారం చూసుకుని. ఆమె బాధ ఎవరూ అర్థంచేసుకోలేదు. ఇంటి పెద్దలు, సిద్ధాంతిగారు, ఆమెను అలా చెయ్యడం ధర్మం అని శాసించారు.

నాకు జ్ఞానంవచ్చినప్పటినుంచి చూస్తూనే వున్నాను. ఎవరో ఒకరి యింట్లో ఎప్పుడూ ఆమె చాకిరీ చేస్తూనే వుంటుంది. ఆమెచేత చాకిరీ చేయించుకోడం బంధువులలో ఆచారమై పోయింది. మరోమాటలేకుండా మౌనంగా ఓరిమితో ఆమె యిలానే జీవితం గడుపుతోంది.

ఏదోవిధంగా కష్టపడి ఒక్క కొడుకును చదువు చెప్పించి, వృద్ధిలోకి తెచ్చి, పెండ్లి చేస్తే, జాజిబొమ్మలాంటి అందమైన భార్య ఆనందంలో మైమరచి, కన్నతల్లిని దూరంగా ఉంచాడు ఆ కొడుకు. ఎడారిలాంటి బ్రతుకులు గడిపే యీ మూగ వితంతువు జీవనం దుర్భరమనిపిస్తుంది మానవత్వమున్న ప్రతి మనిషికీ

"భౌతిక జీవితాల అవసరాలు విస్మరించి, ధర్మశాస్త్రాల పేరుమీద పెద్దలుచేసే శరీర హింసలు ఎప్పటికి అంతరిస్తాయో!" రాజారావు నిట్టూర్పు విడిచాడు.

భోజనాలు పూర్తయ్యాయి. హస్తప్రక్షాళనాలు పూర్తిచేసారు అతిథులంతా. తాంబూలాలు అందాయి అందరికీ.

లలిత తలవంచుకుని ప్రక్కనుంచే వెళ్ళిపోతోంది.

ఆమెను పిలిచాను. తలవంచుకునే నిలబడింది.

'భోజనమయిందా?' అడిగాను.

'ఆఁ' నవ్వింది.

'ఈ పెళ్ళి హడావిడిలో నీతో మాట్లాడలేక పోయాను'.

మౌనంగా ఊరుకుంది.

'నీకింతకష్టం యింత చిన్నతనంలో కల్గుతుందనుకోలేదు'.

ఆమెవదనం విచారమైంది.

ఒకక్షణం నిశ్శబ్దం.

'మళ్ళీవచ్చి నీతో మాట్లాడుతా!'

ఆమె వెళ్ళిపోయింది.

'పద రాజారావూ' అన్నా.

రాజారావు లలితవెళ్ళే వైపు దీర్ఘంగా చూస్తున్నాడు.

'నీకేమౌతుంది ఈ అమ్మాయి' అడిగాడు రాజారావు.

'మా పిన్నమ్మకూతురు చాలా తెలివైన పిల్ల. స్కూలు ఫైనలు చదువుతుంది. రెండేళ్ళ క్రితం భర్త పోయేడు మశూచివల్ల అకస్మాత్తుగా.'

'పాపం. ఈమెను కూడా వికృతంగా చెయ్యలేదు మీ బంధువులు'.

'అందుకు మా శేషమ్మమామ్మ కారణం. ఆవిడే పట్టుబట్టి శిరోముండనం ఆపించింది'.

'మళ్ళీ పెళ్ళి చెయ్యకూడదోయి ఆ అమ్మాయికి.'

'మళ్ళీ పెళ్ళి! అది మావంశాల్లో లేదు. గట్టిగా అన్నావనుక, సిద్ధాంతిగారు మీద పడి అరవగలరు!' అన్నాను.

రాజారావు నవ్వాడు.

తరువాత ఒక కునుకు తీసి లేచి కూర్చున్నాం రాజారావు నేను. పెళ్ళివారు ఫలహారాలు పంపించారు. అవి తిని కాఫీ త్రాగాం.

'మళ్ళీ శరీరంలో క్రొత్తశక్తి వచ్చిందోయి' అన్నాడు రాజారావు ఒళ్ళు విరుచుకుంటూ.

సిద్ధాంతిగారు గుమ్మంలోంచి వెళుతూ నన్ను చూసి ఆగారు.

'రా తాతయ్యా!' అన్నాను.

'ఏరా! కులాసాగా ఉన్నావా. మీ ఆవిడకూడ వచ్చింది కదూ!

'వచ్చింది. పిల్లలుకూడా వచ్చారు.'

'ఈయన ఎవరు?' రాజారావు వైపు తీవిగా చూసారు సిద్ధాంతిగారు. నిర్భయంగా, నిర్లక్ష్యంగా అతను సిగరెట్టు త్రాగడం బాగా నిరసిస్తున్నట్లు.

'అతను మా స్నేహితుడు'

'ఉద్యోగమా!'

'ఆఁ మా ఆఫీసులోనే ఒక అయిదు వందలు యిస్తారు.'

పిల్లలా?'

'పెళ్ళి యింకా కాలేదు.

'అదేమండి. ముప్ఫయి ఏళ్ళొచ్చినా పెళ్ళి చేసుకోలేదు.'

"అది నా స్వంత విషయం. మీ విషయం కావనుకుంటా" రాజారావు నిర్లక్ష్యంగా సమాధానమిచ్చాడు.

"మంచిది!" వినలేక ఒక గుటక మ్రింగారు సిద్ధాంతిగారు. ఇంతలో నా భార్యా పిల్లలు లోపలికి వచ్చారు.

"ఏమే శశీ! జ్ఞాపకం ఉన్నానే!" సిద్ధాంతిగారు బోసినవ్వుతో నా భార్య వైపు చూశారు

"జ్ఞాపకం లేకేముంది"

"ఎంత మంది పిల్లలు"

"ముగ్గురు"



# మామ్మ నడిపిన విప్లవం



"సంసారి అయ్యాక చాలా మారిపోయావే' అనుకున్నా.

ఇంట్లో గుమ్మంలోంచి అతని భార్య నాకేసి తొంగి చూస్తోంది. అయిదడుగుల వెడల్పు ఉన్న ఆ గుమ్మంలో ఆమెఆకారం నిండుగా కనిపించింది. వేళాకోళంగా నవ్వుకున్నాను వీర్రాజు ఎందుకు చిక్కిపోతున్నాడో అర్థంచేసుకుని.

'లోపలికి రారా!' అన్నాడు వీర్రాజు.

నేనూ రాజారావు లోపలి వసారాలోంచి మేడమీదికి వెడుతున్నాం.

ప్రక్కగదిలో సిద్ధాంతిగారు ఠీవిగా పీట మీద కూర్చుని మిఠాయి తింటున్నారు. వీర్రాజు తల్లి, రుద్రాక్షలు ధరించిన సనాతన వితంతువు, సిద్ధాంతి గారికి విసనకర్రతో విసురుతోంది. సిద్ధాంతిగారు బోసినవ్వుతో ఏవో చలోక్తులు విసురుతున్నారు.

'ఆ ముసలి సిద్ధాంతి యిక్కడ ప్రత్యక్షమయ్యాడేమిరా?' రాజారావు ననిగాడు నా చెవిలో.

"అది ఆయనకు అలవాటే! మడి, ఆచారం, లేనిచోట సిద్ధాంతిగారు ఉండరు. వితంతువులు మడిగా ఉంటారు కాబట్టి అక్కడికే చేరుతారు ఆయన" వ్యంగ్యంగా అన్నా, వీర్రాజు వినకుండా.

రాజారావు అర్థం చేసుకున్నాడు.

వీర్రాజుతో కాస్సేపు మాట్లాడి, చిన్ననాటి విషయాలు జ్ఞప్తికి తెచ్చుకుని ఆనందించాను నేను.

'ఒరేయి! పెద్దవాడవు, గొప్పవాడవు అయిపోతున్నావు మరిచిపోకేం!' అన్నాడు వీర్రాజు వీడ్కోలిస్తూ.

'అది అసంభవం' అంటూ నడిచి వచ్చేశాను.

సాయంత్రం చల్లగాలి బాగా వీస్తోంది. గృహాంగణంలో గృహిణులు అలంకరించుకుని మల్లెపూలచెండుల వాసనలు జిమ్ముతూ వచ్చే వెళ్ళేజనం వైపు చూస్తూ ఆఫీసు నుంచి వచ్చే భర్తలకై ఎదురుచూస్తున్నారు. మా పెళ్ళివారి యింట్లో రాత్రి దంపతుల శోభనానికి అన్ని హంగులు చేస్తున్నారు.

'నువ్వు మాట్లాడవలసిన బంధువులు యింకా ఉన్నట్టున్నారు. మాట్లాడుతూ ఉండు. నేను అలా వెళ్ళి వూరంతా చూసివస్తా' అన్నాడు రాజారావు నవ్వుతూ.

రాజారావు నవ్వులోనిఅంతరార్థం నాకర్థమయింది. ఒంటరిగా జీవిస్తున్న అతన్ని సాయంత్రమవగానే ఒంటరిగానే వదిలివేయవలసిన బాధ్యత గుర్తించాను. రాజారావు వూళ్ళోకి వెళ్లిపోయాడు.

శోభనంగది రాత్రి చాలా అందంగా అలంకరించారు. ముత్తైదువులు గుమిగూడారు. మధురమైన కంఠంతో ఇంటివారి కోడలు జయదేవుడి గీతాలు ఆలపించింది. సంగీతం నేర్చుకుంటున్న ఒక పాప జోలపాట పాడింది. గది అంతటా వెదజల్లబడిన మల్లెపూల పరిమళం అందరినీ మత్తులోముంచి తేల్చుతోంది. గత స్మృతుల మాధుర్యము నెమరు వేసుకుంటున్నారు మూల ఒరుగుతున్న ముసలి పెద్దలు. ముత్తైదువుల మధ్యనుంచి నా భార్య నవ్వుతూ నా వైపు చూసింది. క్రొత్త దంపతులు తాంబూలాలు పాత దంపతులకు పంచిపెట్టారు. కన్నీరు తుడుచుకుంటూ ఒకమూల లలిత విచారంగా నుంచుని చూస్తోంది ఆ దృశ్యం.

సిద్ధాంతిగారు తాంబూలం అందుకుంటూ బోసి నవ్వుతో బుజాలు ఎగరేస్తూ ఏదో లీలగా హాయిగా ఆలోచిస్తూ బయటికి నడిచారు. నన్ను చూసి ఒక క్షణం ఆగి 'మీ స్నేహితుడేడోయ్!' ప్రశ్నించారు.

'ఊరు చూద్దామని బయటికి వెళ్లాడు.'

'తిరిగి రాత్రి యింటికి వస్తాడా?'

'రానని మాతో చెప్పాడా తాతయ ఎదురుప్రశ్న వేశాను

'అదికాదులే, చాలా పొగరుబో కనిపిస్తున్నాడు నీకూ వాడికీ స్నేహం కుదిరిందో కాని'

"పైకి అలాకనిపించినా, అతను చ మంచివాడు తాతయ్యా!"

'అది నువ్వుచెప్పాలా! తెలుస్తూ వుందిగా! ముప్పైఏళ్ళదాకా పెళ్ళిచే కోని మనిషిలో గృహస్థధర్మాలు, మం దలు మచ్చుకైనా ఉంటాయని ఎవర కుంటారులే!'

"పెళ్ళికీ గుణానికీ సంబంధం లే తాతయ్యా! గుణంలేని గృహస్థులు ఉన్నారు. గుణమున్న బ్రహ్మచారులూ ఉన్నారు. అతడు బ్రహ్మచారి అయినా గృహస్థుడికంటె అనేక నీతి నియమాల్లో చాలారెట్లు మంచివాడు."

"చాలేరా! వాడి వాలకం చూస్తూం టేనే తెలుస్తోంది ఎటువంటివాడో! ఏ కిరస్తానీవాళ్ళతోనో గడిపేరకం!"

"అది చాలాతప్పు అభిప్రాయం తాతయ్యా!"అన్నాను.

ఇంతలో నాభార్య ఎందుకో పిలిచింది. ఆ సంభాషణ ఆగిపోయింది; అంతటితో.

రాత్రి రెండుగంట లయింది. క్రొత్త దంపతుల గదిలోంచి గుసగుసలు వినిపిస్తున్నాయి. కిటికీ సందులోంచి వెలుగులు కనిపిస్తున్నాయి. నిద్రరాక, ఏమీతోచక సిగరెట్టు వెలిగించి డాబాపై పచా చేస్తున్నాను.

రాత్రి రాజారావు ఇంటికి రాలే ప్రొద్దున్నే పళ్ళుతో ముకుంటూం ప్రత్యక్షమయ్యాడు అతను. మామూలు ప్రొద్దున్న కాఫీ ఫలహారాలు పూర్త పోయాయి.

"మావాళ్ళు పట్టుపడ

మని. మరోవారం ఇ

వస్తోందోయి" అన్నాను

'సరే మంచిదే! నేన

గిస్తాను. ఈలోగా చుట్టు

చారిత్రక స్థలాలు చూసివస్తా' అన్నా

రాజారావు.

ఆ వారం రోజుల్లో రాజారావు చుట్టుప్రక్కల గుళ్లు, గోపురాలు అనేకం చూస్తు రాత్రి యింటికి వచ్చేసేవాడు. తర్వాత మేమేవో కబుర్లు చెప్పుకుని పడుకునే వాళ్ళం.

"క్రొత్త దంపతులు ఎలావున్నారోయి" అడిగాను ఒకరోజు.

"ఈడూ జోడూ బాగానేవుంది. కాని ఇది పెద్దలు చేసిన పెళ్ళా? వాళ్లు చేసుకున్నదా?" అడిగాడు రాజారావు.

"పెద్దలే నిశ్చయించారు. దంపతులు దగ్గరి బంధువులైనా, చిన్నప్పటి నుంచీ ఒకరి నొకరు ఎరిగున్నా, ఎప్పుడూ మాట్లాడుకో లేదు; కాదు మాట్లాడుకోనివ్వలేదు పెద్దలు"

"తెలివి తేటల్లో తమను మించిపోగల రేమో అని పెద్దల భయం కాబోలు — లేక పోతే ఇంత అనవసరమైన వేలరూపాయలు ఖర్చు లేకుండా ఒంటరిగా ఎక్కడైనా పెళ్లి చేసేసుకుంటారేమో అని భయం కలిగి ఉంటా యమ్మ!" వ్యంగ్యంగా నవ్వాడు రాజారావు.

"అంతే" అన్నా.

"తమ జీవితాల బూజులు దులుపుకోలేని పెద్దలు ఇంకొకరి జీవితాలు దిద్ద పూనుకోవడం గర్హించదగిన విషయం" అన్నాడు రాజారావు తీవ్రంగా.

* * *

'గతం గురించి విచారిస్తే ప్రయోజనం లేదు, ప్రస్తుతం ఆలోచించాలి. నేను రేపు వెళ్లిపోతున్నా' అన్నాడు రాజారావు ఏదో ఆలోచిస్తూ, సిగరెట్టు పీలుస్తూ!

పరధ్యాన్నంగా అన్నాను "అలాగే!" అని

మర్నాడు రాజారావు వెళ్ళిపోయాడు. అతను వెళ్లిపోవడంవల్ల కలిగిన విరామం నా ఆనందానికి అవకాశమిచ్చిందని సంతోషించాను.

నా సెలవు మరో రెండురోజులు పొడిగించాను.

మర్నాడు మధ్యాహ్నం మా పిన్నమ్మ వచ్చింది నా దగ్గరికి హఠాత్తుగా!

'ఒరే! లలిత కనిపించటంలేదురా నిన్న రాత్రినుంచి!' అంది పిన్నమ్మ! ఆమె ఆత్రుత నాకు మొదట అర్థంకాలేదు.

సిద్ధాంతిగారు యీ సంగతివిని తోక త్రొక్కిన త్రాచులా మా యింట్లో వాలారు.

[illegible] చూస్తూనే వున్నాను. ఏమైనా కూర్చునా రాజారావు లేవతీసుకు పోయా మ్మల్ని మా తిప్ప తెచ్చే పీనుగు!" పళ్లు వసారాలో కుళ్లితో పటపట కొరికారు నిన్న ఏవో సం[illegible] [illegible]. లలితమాటలేదు.

మర్నాడు గాలించాం, లలితకోసం. ఎక్కడా కనిపించలేదు. రాజారావు వెళ్లిపోయిన రెండురోజులకు లలిత కనిపించలేదు. అతను ఎప్పుడూ ఆమెతో మాట్లాడినట్లు కూడా లేదు. రాజారావు యీపని చేశాడని అనుకోడానికి నాకు ఆస్కారం లేకపోయింది.

సిద్ధాంతిగారు రుద్రుడులా, కాలయముడిలా యింట్లో నృత్యము చేస్తున్నారు. నామీద చెప్పలేనన్ని కారాలు మిరియాలు నూరుతున్నారు.

నేనేమీ అనలేకపోయాను సిద్ధాంతిగారిని.

మూలగా మౌనంగా కూర్చున్న శేషమ్మ మామ్మలో ఏమిటో ఉద్రేకం తాండవించింది.

'వాడిని ఎందుకు అందరూ తిడతారు? వాడు చాల మంచిపని చేశాడు. ఆ రాజారావే యీ పెళ్ళికి రాకపోతే లలితకు ఈ ముళ్ల సంఘం చెరసాల తప్పేది గాదు. లలిత అతనితో లేచిపోతే అది చాల మంచిపనే! అదృష్టముంటే పెళ్ళి జరిగి హాయిగా బ్రతుకుతుంది. లేకపోతే! ఇప్పుడు ఆమె చేసిన సాహసం, ఆమెజీవితాన్ని క్రొత్తపంథాలో నడిపించే శక్తి యిచ్చి, బాగుచేస్తుంది. నాలా మగ్గి యీ సంఘంలో చచ్చేకంటే పక్షిలా హాయిగా బ్రతికడం మేలు. అది నేర్పుతుంది లలిత". ఒక్కొక్క మాట పిడుగులు రాలినట్లు వచ్చింది శేషమ్మ మామ్మ నోటినుంచి. తనమీద బావుటా ఎత్తి విప్లవం లేకెత్తిస్తోందా అని సిద్ధాంతిగారు విస్తుపోయారు ఆ ముసలి వితంతువును చూసి.

'నువ్వేం మాట్లాడుతున్నావో తెలుసా! శేషమ్మా!' అరిచాడు సిద్ధాంతిగారు; ఆమె మీద తనకున్న వ్యక్తిగత ప్రభావాన్నంతా కూడగట్టుకుని.

"తెలుసు. నీకూ ఆ పిల్లకీ ఏం సంబంధం! దూరపు చుట్టమైనంత మాత్రాన, మా కుటుంబాలను యిష్టమొచ్చినట్లు కూలనాడడానికి నీకు హక్కు ఏముంది?" అందరి హృదయాలలోనూ అణిగి ఉన్న ఆ ఎదురుప్రశ్న శేషమ్మమామ్మ సిద్ధాంతిగారిపై విసిరింది, మర్యాద, మన్నన మరిచిపోయి.

సిద్ధాంతిగారి ముకుళితముఖం జేగురు ముద్దలా కనిపించింది. కండువా భుజంమీద వేసుకుని లేచాడు తనహయాం అంతరించే రోజులు వచ్చేయని తెలుసుకుని.

పోస్టుమేన్! బయటనుంచి పిలుపు!

ఉత్తరం విప్పిచూశాను. పసుపురాసిన తెల్లకాగితంమీద నల్ల అక్షరాలు కనిపించాయి. ఆత్రుతతో చదివాను. నవ్వుకున్నా. నా నవ్వులోని ఆనందం ఎవరికీ చెప్పడానికి వీలులేకపోయింది.

'సాయంత్రం అన్నవరం కొండకు వెళ్ళాలి తయారవు.' నా భార్యను ఆజ్ఞాపించాను తక్షణం.

"ఎందుకురా?" అన్నారంతా

"నాయిష్టం" అన్నా.

నా భార్య తెల్లబోయింది. దేవుణ్ణి చూడ్డానికి కాబోలు అనుకుంది.

అన్నవరం కొండమీద చెట్లనీడలో మమ్మలిని ఆహ్వానించడానికి ఎదురుగా [illegible] చూడగానే నా భార్య ఆశ్చర్యపోయింది.

"క్రొత్త దంపతులను ఆశీర్వదించవయ్యా" అంటూ అరిచాడు రాజారావు దూరాన్నుంచి నవ్వుతూ.

నా భార్య అది విని ఏదో అర్థమయినట్లు నవ్వింది.

'మాస్తారేం! గబగబ ఎక్కండి కొండ! ఓపిక పోగొట్టుకుని పాత దంపతులనిపించుకున్నారు!" అంది నా భార్య వేళాకోళంగా.

కొండ ఎక్కగానే రాజారావు నన్ను కౌగలించుకున్నాడు.

'ఎలావున్నాయి పరిస్థితులు?' నవ్వాడు రాజారావు.

'బాగున్నాయి' అన్నా.

'ఇక్కడికి తీసుకువచ్చి, నాకీ అప్సరసను చూపించినందుకు నీకు నా కృతజ్ఞతలు!'

నవ్వాను నేను.

'మీ శేషమ్మ మామ్మ దేవతోయి! మా సమాగమానికి ఆమే పూజారి!"

శేషమ్మ మామ్మ సిద్ధాంతిగారిపై చూపిన రౌద్రంలోని అంతరార్థం నాకు ఇప్పుడు అవగతమయింది.

కొండమీద దేవాలయం గంభీరంగా పవిత్ర మానవ ఆశయాల ప్రతిబింబంగా నిలుచుంది. కొండమీద రివ్వుమని వీచే చల్లగాలిలో హాయిగా స్వేచ్ఛగా ఆలయ ప్రాంగణంలో అడుగిడుతూ దైవానికి ప్రణమిల్లాం మేమంతా. కాని, తన పరిస్థితులకు బలియై, యీ పరిస్థితులు కల్పించిన శేషమ్మ మామ్మ మాత్రమే ఆ దేవాలయంలో ప్రతీచోటా నా కంటికి కనిపించింది.





శంఖచక్రధారి [శిల్పం]

# బొంబాయి సినిమా లేఖ

ప్రభుత్వం ఇవ్వబోయే, పారిశ్రామికులకు అప్పులతో, ముడిఫిలింమీద, విదేశీ చిత్రాలమీద సుంకాలద్వారా పన్నెండు లక్షల రూపాయల నిధితో ఏర్పడబోయే పెట్టుబడి కార్పొరేషన్ వ్యవహారాలు నడపడానికి నేషనల్ ఫిలింబోర్డు పేరిట ఒక సంస్థ ఏర్పడబోతోంది. ఇందులో ఫిలిం పరిశ్రమవారికి మూడు స్థానాలు కేటాయిస్తారు. సెన్సారు సంఘాధ్యక్షుడు, అవతరించనున్న ఫిలిం ఇన్‌స్టిట్యూట్ అధిపతి, డాక్యుమెంటరీ ఫిలిం శాఖాధికారి, బాలచలనచిత్ర సంస్థ డైరెక్టరూ మిగతా సభ్యులు. సాంస్కృతిక, సాంఘిక, కళారంగాల ప్రతినిధులు మరో ముగ్గురు కూడా ఉంటారు.

కేంద్ర సెన్సారుబోర్డు, ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌ల కార్యకలాపాలను సమన్వయించడం, అజమాయిషీ చేయడం యీ జాతీయ ఫిలిం సంస్థ కార్యకలాపాలు. ప్రభుత్వం ఫిలింస్ డివిజన్ దీనిపరిధిలోకి రాదు.

కేంద్రప్రభుత్వ సమాచార, రేడియో ప్రసారశాఖ కార్యదర్శి శ్రీ పి. ఎం. లాడ్ మొన్న ఈ విషయాలు తెలియచేస్తూ ఈ సంస్థ నిర్వహణకు సాలుకు రెండులక్షల రూపాయల వరకూ ఖర్చు కాగలదన్నారు. వచ్చే జూలైలో, ఈ సంస్థ స్థాపనకై పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టబోతున్నట్లు ఆయన తెలియచేశారు.

విదేశాల చిత్రాలను హిందీలోకి 'డబ్' చేయడం, విదేశాలతో కలిసి చిత్రాల నిర్మించడం మన చిత్రాలు ఆ యా దేశాలలో ప్రదర్శించే పద్ధతిలో వివిధ దేశాల చిత్రాలను దిగుమతి చేసే పద్ధతి ఏర్పాటు చేయడం మొదలైన విషయాలపై ఫిలింపరిశ్రమ అభిప్రాయాలను కేంద్రప్రభుత్వ సమాచారశాఖ కోరింది. ఈ సూచనలకు-ముఖ్యంగా చివరి దానికి మన ఫిలింపరిశ్రమలోని వారంతా చాలా హర్షించగలరు. ఎందుకంటే, హాలీవుడ్ నుంచి వచ్చే చిత్రాలు ఇక్కడ గాబా



"ఖాన్ బస్"లో ఎం. ఎస్. రాజం.

చేసుకోవడం జరుగుతున్నా, భారతీయచిత్రానికి కూడా అమెరి వాణిజ్యసాయిలో ప్రదర్శనకు వస లభించడంలేదన్న విషయం విదితమే.

* * *

ఫవాసినికితిన్ భారతయాత్రపై భారత ్యల సంయుక్త చిత్ర నిర్మాణంపై న్నసే ఉభయపక్షాలూ తుది ఒప్పందం సుకున్నారు. ఇందుకై, "మాస్ ఫిలిం" డియో ప్రతినిధి శ్రీ కె. పి. కార్లోవ్ న్నసే బొంబాయి వచ్చారు. రష్యా ప్రున ఆయనా, "నయాసంసార్" ఇంట ్షనల్ తరఫున శ్రీ కె. ఎ. అబ్బాస్ ప్పందంపై సంతకాలు చేశారు. ఇతః ార్యం అనుకొన్నట్లుకాక, ఇప్పుడు యీ ్రాన్ని హిందీ, రష్యన్‌లతోపాటు ంగ్లంలో కూడా విడుదలచేయ నిశ్చయిం ారు. హిందీ చిత్రానికి "పరదేశి" అని, ష్యన్ చిత్రానికి "జర్నీ బియాండ్ త్రీసీస్" ని పేరు పెడతారు. పై జూలైనాటికి ూటింగ్ పూర్తి అవుతుంది.

ఈ చిత్రంలో నర్గీస్ ఒక ముఖ్య భూమిక ిర్వహించగలదని పాఠకులకు విదితమే. ాతే, ఒక నర్తకి భూమిక ఉంది. మద్రా సుకు చెందిన ఒక ప్రముఖ నర్తకితో ీ అబ్బాస్ దీనిపై సంప్రతిస్తున్నారు.

* * *

తాయ్ ప్రభుత్వాధ్వర్యాన తయారవు తున్న బౌద్ధ చిత్రం "అంగుళిమాల" దర్శ చేతులు మారింది. ఇతఃపూర్వం ఎన్‌గుప్తను ఇందుకు నియోగించారు తిరిగి ఇపుడు విజయభట్‌కు ఒప్పగిం గేవాకలర్‌లో నిర్మించబడనున్న ఈ నేడో రేపో సెట్స్‌కు వెళ్లబో షూటింగ్ మెహబూబ్ స్టుడి సాగుతుంది. భరత్ భూషణ్ మనోహర్‌కృష్ణ, ఉల్హాస్, అచల ్, ఇందులో పాల్గొంటారు. న్నే అలీరజా, సంభాషణలు పండిత ్రన్ వ్రాస్తారు. సంగీతం అనిల్ స్ సమకూర్చుతారు. కళాదర్శకుడు ేశాయ్, ఫొటోగ్రఫీ వి. అవధూత్, ిస్తారు.

* * *

్రుధ్వీరాజ్ ఒక చలనచిత్రం నిర్మించ న్నారు.

యన స్వంత నాటక సంస్థ పృధ్వీ థియే ద్వారా ప్రసిద్ధికెక్కిన నాటకం ా" నే తెరమీద చిత్రిస్తారు. నిర్మాత ుడూ కూడా ఆయనే. ఈ చిత్రం వచ్చే వలినాడు సెట్స్‌కు వెళ్తుంది.

* * *

పభుత్వం బహుమతులిచ్చి గౌర చతగు చిత్రాలను ఎన్నిక



రాజ్‌కమల్ వారి నాట్యతార, ఝనక్ ఝనక్ పాయల్ బాజే చిత్రంలో నృత్యంతో ఈమె మంచిపేరు గడించుకుంది.

చేసే సంఘంలో ఫిలిం పరిశ్రమకు మరొక స్థానంకూడా ఇవ్వాలని దర్శక నిర్మాత శ్రీ వి. శాంతారాం చేసినఅభ్యర్థనను ప్రభుత్వం అంగీకరించింది. ఈ విషయాలపై శ్రీ శాంతారాం, ప్రభుత్వ సమాచార రేడియో శాఖ కార్యదర్శితో జరిపిన సంప్రతింపుల ఫలితంగా ఇది కుదిరింది. ఇప్పుడు శ్రీ శాంతారాం తమ టెక్నికలర్ చిత్రం "ఝనక్ ఝనక్ పాయల్ బాజే"ను కూడా ప్రభుత్వ బహుమతులపోటీకి పంపించడానికి అంగీకరించారు.

* * *

"బాంబే రేస్‌కోర్స్" అనే కొత్తచిత్రానికి మొన్న ప్రారంభోత్సవం జరిగింది. ఇందులో నళినీజయవంత్ నాయిక. కె. ఎన్. సింగ్, ఓంప్రకాశ్, చమన్‌పూరి, రంజనాసుకో, డిప్ అనేవారు ఇతర పాత్రలు టారు. దర్శకుడు 'అస్తానా' సంగీతం మదన్‌మోహన్.

భాగ్యోదయ పిక్చర్స్ వారు కిదార్ కపూర్ దర్శకత్వాన నిర్మిస్తున్న "ఇన్ సాఫ్" లో కూడా నళినీజయవంత్ నటి స్తోంది. ఈ చిత్రనిర్మాణబృందం హైదరా బాద్‌లో కొన్ని సన్నివేశాలు షూట్ చేస్తు న్నారు.

గత జనవరి 26 న విడుదల కావలసిన చిత్రం "జనవరి 26" నిర్మాణం ఇప్పటికి పూర్తిఅయింది. పేరుమార్చి "భారతి" అని నామకరణం చేశారు. రమేష్‌సైగల్ దర్శక

త్వాన ఈచిత్రం తయారైంది. ఇందులో కూడా నళినీజయవంత్ పాల్గొంది.

*  *  *

గతవారం గురుదత్ ఇంట్లో ముగ్గురికి పుట్టినరోజు పండుగలు జరిగాయి. ఒకటి గురుదత్ ది. మరొకటి ఆయన కుమారుడు తరుణ్ ది. పన్నెండుగంటల తరువాత, గురుదత్ భార్య, (ప్లేబాక్ గాయనిగీతారాయ్) గీతాదత్ మరొక కులదీపకుణ్ణి అందించింది.

*  *  *

పి. ఎన్. అరోరా నిర్మించిన "అంజాన్" మొన్న విడుదల అయింది. ఎం. సదిక్ దర్శకత్వాన తయారైన ఈచిత్రంలో వైజయంతిమాల, ప్రదీప్‌కుమార్, జానీవాకర్ పాల్గొన్నారు. బస్తీతత్వం బాగా వంటపట్టిపోయిన, కలవారి పిల్లవాడి ప్రేమకథను దర్శకుడు సదిక్ చక్కని హాస్య సన్నివేశాలతో, రక్తికరంగా చిత్రించారు. కొండ చరియలలో తిరిగే ఒక అమాయక ఈచిత్రానికి నాయిక. హేమంతకుమార్ దీనికి మధురమైన, మరపురాని సంగీతాన్ని కూర్చారు. నృత్యాలు కూడా కంటికి ఇంపుగా ఉన్నాయి. 'హుటూటూ' అనే నృత్యం అద్భుతంగా ఉంది.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)

# చలనచిత్రాలకు ప్రభుత్వ సత్కారం

## ప్రాంతీయ నిర్ణాయకసంఘాల ఏర్పాటు

1955 లో విడుదల అయిన చలన చిత్రాలలో ఉత్తమ చిత్రాలను, ఉత్తమ కళాకారులను సత్కరించడానికి జరుగవలసిన తతంగంలో తొలిఘట్టం పూర్తికావచ్చింది. అఖిలభారత నిర్ణాయకసంఘం పరిశీలనకై చిత్రాలను ఎన్నిక చేసే నిమిత్తం ప్రాంతీయ సంఘాలు ఏర్పాటు అయ్యాయి వారు మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరాలలో ఆయా ప్రాంతీయ చిత్రాలను చూస్తున్నారు.

ఈ ఏడాది పోటీకి 51 కథా (ఫీచర్) ప్రధాన చిత్రాలు పోటీచేస్తున్నాయి. వీటిలో కొన్ని కేంద్ర సెన్సారుకు సంఘ ప్రాంతీయ అధికారులు సిఫార్సు చేసినవి. మిగతావి ఆయా నిర్మాతలు వ్యక్తిగతంగా పంపినవి. వీటిలో ఉత్తమ చిత్రాలకు ఇచ్చే బహుమతులుకాక, పిల్లల చిత్రాలలో ఉత్తమమైనదానికీ, ఉత్తమమైన డాక్యుమెంటరీ చిత్రానికీ ప్రధాని, రాష్ట్రపతుల పేరిట సువర్ణపతకాలుఇచ్చి గౌరవిస్తారు

ఈ విధంగా చలనచిత్రకళను ప్రభుత్వం సత్కరించి ప్రోత్సహించేసంప్రదాయాన్ని కేంద్ర సమాచార, రేడియో ప్రసారశాఖ 1954 లో నెలకొల్పింది.

మద్రాసు ప్రాంతీయ నిర్ణాయక సంఘంలో శ్రీ ఎం. భాష్యంఅయ్యంగార్ (అధ్యక్షుడు), శ్రీమతి మంజు భాషిణి, డా॥ ఎం. వరదరాజన్, ప్రొ॥ ఆర్. సుబ్బారావు, డా॥అయ్యప్పన్, శ్రీ ఎ. రామయ్య, శ్రీ బి. ఎన్. గుప్త ఉన్నారు.

బొంబాయి సంఘానికి శ్రీ ఎం. డి. భట్, కలకత్తా ప్రాంతీయ సంఘానికి ప్రొ॥ ఎన్. కె. సిద్ధాంత అధ్యక్షులు.

## 'ఉత్తమ కన్నడ నటి'గా జమునకు గౌరవం

కన్నడ చలన చిత్రాభిమానుల సంఘం, 'చలచ్చిత్ర' సంస్థవారూ కన్నడ చలన చిత్ర కళాకారులను గౌరవించడానికి తలపెట్టిన కార్యక్రమంలో, ఎ. వి. ఎం. వారి "ఆదర్శ సతి" చిత్రంలో నటించిన 'జమున'ను ఉత్తమనటిగా ఎన్నిక చేశారు. ఎ. వి. ఎం. వారు "నాగుల చవితి"కి ఈ చిత్రం కన్నడప్రతి అన్న విషయం విదితమే.

ఈ చిత్రాన్ని ఉత్తమ చిత్రంగానూ, దర్శకుడు శ్రీ చిత్రపు నారాయణమూర్తిని ఉత్తమ దర్శకుడుగానుకూడా వీరు ఎన్నుకొన్నారు.

## సినిమా వార్తలు

ప్రభా ప్రొడక్షన్స్ వారు "అనసూయ" అనే చిత్రం నిర్మిస్తున్నారు. అంజలి, నాగేశ్వరరావు, ఇందులో ముఖ్యభూమికలు నిర్వహిస్తున్నారు. కన్నాంబ, రాజసులోచన, సూర్యకళ, ఆమ్మాజీ, రేలంగి, గుమ్మడి, చలం, కుటుంబరావు, నల్ల రామమూర్తి, అల్లు రామలింగయ్య, బాలకృష్ణ, మొదలగు నటీనటులంతా పాల్గొంటున్న ఈ చిత్రానికి శ్రీ సి. ఎస్. రావు దర్శకుడు. కథ, మాటలు శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి. సంగీతం శ్రీ రాజేశ్వరరావు. ఫొటోగ్రఫీ: అజిత్ కుమార్.

ఎడిట్ చేసిన ఫిలిం ఇప్పటికి నాలుగురీళ్లు పూర్తి కావచ్చింది. నవంబరు నాటికి చిత్రాన్ని విడుదల చేయాలని నిర్మాతల సంకల్పం.

*  *  *

బి. ఎన్. రంగా కొత్తచిత్రం 'మార్కం





సమతా పిక్చర్స్‌వారి "అమరజీవి"లో సావిత్రి.

జేయ' ఆయన స్వంతంగా నిర్మించిన విక్రం స్టుడియోలో తయారవుతోంది. దర్శకత్వం ఛాయాగ్రహణం కూడా రంగాగారే నిర్వహిస్తున్నారు.

నాగయ్య, పుష్పవలి, ఆమె కుమారుడు బాబ్జీ ఇందులో పాల్గొంటున్నారు. రచన సముద్రాల రాఘవాచార్య. సంగీతం విశ్వనాథం, రామమూర్తి సమకూర్చుతున్నారు.

* * *

ఆంధ్రలో విజయవంతంగా నడచిన అన్నపూర్ణా పిక్చర్స్‌వారి 'దొంగరాముడు' చిత్రం 'తిరుట్టురామన్' పేరిట తమిళంలో విడుదల అయింది. తమిళ చిత్రానికి ఉదయకుమార్ మాటలు, కణ్ణదాసన్ పాటలూ వ్రాశారు.

ఈ సంస్థ అధిపతి శ్రీ నాగేశ్వరరావు, ఈ చిత్రాన్ని హిందీలో కూడా నిర్మించాలని సంకల్పించినట్లు తెలుస్తోంది.

* * *

జూపిటర్ పిక్చర్స వారి తెలుగు చిత్రం "ఉమాసుందరి" జూలై 20 న విడుదల

# సినిమా వార్తలు

అయింది. 'నల్లతంగాళ్' అనే తమిళ చిత్రం ఆధారంగా తయారైన ఈ చిత్రంలో ఎన్. టి. రామారావు, శ్రీరంజని, నాగయ్య, కన్నాంబ, రేలంగి, బాలసరస్వతి ప్రభృతులు నటించారు. దర్శకుడు శ్రీ పి. పుల్లయ్య, సహాదర్శకుడు, శ్రీ లంక సత్యం.

నరసువారి "భలేరాముడు" చిత్రం జూలై 15 న విజయవాడ సరస్వతీ పిక్చర్ పాలెస్‌లో శతదినోత్సవాలు చేసుకొంది. సావిత్రి, నాగేశ్వరరావు, రేలంగి, సి. ఎస్. ఆర్. గుమ్మడి, చలం, హేమలత, గిరిజ ప్రభృతులు నటించిన ఈ చిత్రం రాజమండ్రి గుంటూరు, తెనాలి మొదలైన పట్టణాలలో కూడా శత దినోత్సవాలు జరుపుకోబోతోంది. ఈ చిత్రం దర్శకుడు శ్రీ వేదాంతం రాఘవయ్య. శ్రీ రాజేశ్వరరావు సంగీతం సమకూర్చారు.

* * *

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారు రెండు పౌరాణిక చిత్రాలు నిర్మిస్తున్నారు. మొదటిది 'శ్రీకృష్ణమాయ' రెండవది 'భూకైలాసము' ఈ చిత్రాన్ని తెలుగు తమిళ కన్నడ భాషలలో నిర్మిస్తారట. 'భూకైలాస్' అనే పేరుతో 1940 ప్రాంతాలలో ఫేమస్ టాకీస్ వారు ఒక చిత్రం నిర్మించారు. అందులో శ్రీమతి కన్నాంబ, శ్రీ శ్రీ వేమూరి గగ్గయ్య పాల్గొన్నారు.

రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ అధిపతి శ్రీ నాగభూషణం దర్శకత్వాన తయారవుతున్న మరో పౌరాణిక చిత్రం" 'సావిత్రి' శ్రీమతి ఎస్. వరలక్ష్మి నిర్మిస్తున్నది.

నారాయణ్ కంపెనీ అధిపతి శ్రీ నారాయణ అయ్యంగార్ 'దేవత' అనే పేరుతో ఒక హిందీ చిత్రం నిర్మించారు. అంజలి, వైజయంతిమాల, జెమినీ గణేశన్ నటించిన ఈ చిత్రం బొంబాయిలో ఆగస్టు 10 న విడుదల కాబోతోంది. దక్షిణ భారతంలో విజయవంతంగా నడచిన "కణవనే కన్‌కండ దైవం" అనే తమిళ చిత్రం దీనికి మాతృక. దర్శకుడు శ్రీ పట్టన్న.

ఈ చిత్రంలో నాలుగు వేల అడుగుల భాగాన్ని గేవాకలర్ లో షూట్ చేశారు.

* * *

హిందీ మార్కెట్‌లో ప్రవేశిస్తున్న మరో సంస్థ మద్రాసు సినీ కార్పొరేషన్. వీరి తమిళ చిత్రం "గులేబకావళి"లో కొన్ని సన్నివేశాలు తిరిగి షూట్ చేసి, హిందీలో విడుదల చేస్తున్నారు. ఆగస్టులోనే ఇదికూడా విడుదల కావచ్చు. ఎం. జి. రామచంద్రన్, టి. ఆర్. రాజకుమారి, జి. వరలక్ష్మి పాల్గొన్నారు.

హిందీ మార్కెట్‌లో ప్రవేశించి సత్ఫలితాలు సాధించిన వారిలో ఏ. వి. యం.



చిత్రభారత్ వారి కన్నడ చిత్రం "భాగ్యచక్ర"కు వాహినీలో మొన్న పాటల రికార్డింగ్ జరిగింది. ఈ చిత్రంలో, శ్రీ డి. ఎల్. నారాయణ (వినోదా), సంగీత దర్శకుడు శ్రీ విజయభాస్కర్, ఛాయాగ్రహణ దర్శకుడు శ్రీ వి. ఎన్ రెడ్డి, కెమెరామన్, నిర్మాత ఎన్. జి. రావు, వాహినీ రికార్డిస్టు శ్రీకృష్ణన్ ఉన్నారు.

అధిపతి శ్రీ మెయ్యప్పన్ ఒకరు. ఆయన నిర్మించిన హిందీ చిత్రం "భాయ్ భాయ్" ఉత్తరాదిన రజతోత్సవాలు చేసుకుంది. ఆ చిత్రం బొంబాయి నగరంలోనే మూడు థియేటర్లలో నడుస్తోంది. ఈ విజయాన్ని పురస్కరించుకొని శ్రీ మెయ్యప్పన్ ఇప్పుడు మరి మూడు హిందీ చిత్రాల నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నారు. మొదటిది, దక్షిణ భారతంలో విజయయాత్ర చేసిన 'విజయ' వారి మిస్సమ్మ. విజయ సంస్థ అధిపతి శ్రీ నాగిరెడ్డిగారే దీన్ని లోగడ హిందీలో నిర్మించాలని అనుకున్నారు. గాని విరమించుకున్నారు. ఇప్పుడు మెయ్యప్పన్ ఆ కథను కొన్నారు. విజయావారి 'మిస్సమ్మ' చిత్రానికి దర్శకత్వం వహించిన శ్రీ ఎల్. వి. ప్రసాద్ కే హిందీ చిత్రాన్ని కూడా ఒప్పగిస్తారు. నటీనటులను మాత్రం ఉత్తరాది నుండి తీసుకురావాలని ప్రయత్నాలు చేస్తున్నారు. ఆమ్యాత్య నర్గిస్ దేవానంద్‌లను బుక్ చేస్తారనుకున్నారు. క్రిందటి నెల శ్రీ మెయ్యప్పన్ బొంబాయి వెళ్ళి మీనాకుమారిని కిశోర్‌కుమార్‌ను బుక్ చేశారని తెలిసింది. మిగతా నటీనటుల విషయం ఖరారు కాలేదట.

ఏ. వి. యం. నిర్మించబోయే మరో హిందీ చిత్రానికి మహారాష్ట్ర దర్శకుడు, రాజా పరంజ్‌పె దర్శకత్వం వహిస్తారట. శహనాయ్, ఖిడ్కీ, సర్గం, వంటి చిత్రాలు నిర్మించిన సంతోషి మూడవ చిత్రానికి దర్శకుడట. కథ కూడా ఆయనే తయారుచేస్తారు.

* * *

## తిలక్ పై డాక్యుమెంటరీ చిత్రం

భారత ప్రభుత్వం పనుపున, శ్రీ విశ్రాం బడేకర్ లోకమాన్య బాలగంగాధర తిలక్ జీవిత విశేషాలను, ఆయన కృషి ఫలితాలను చిత్రిస్తూ డాక్యుమెంటరీ చిత్రం ఒకటి నిర్మించారు. భారత విప్లవోద్యమ నాయకుడుగా, పితృతుల్యుడుగా, కాంగ్రెసు పతాకచ్ఛాయకు ముఖ్యతరగతి ప్రజలను ఆకట్టుకొనివచ్చి 'జాతీయ కాంగ్రెసు' అన్న పేరును సార్థకం చేసినవాడుగా లోకమాన్యుడు సాగించిన వివిధ కార్యకలాపాలను చూపడానికి ఆయా చరిత్రాత్మక స్థలాలకు వెళ్ళి శ్రీ బడేకర్ వివిధ సన్నివేశాలు చిత్రించారు. చిత్రం పొడుగునా అవసరమైన చోట్ల తిలక్ ఛాయాచిత్రాలను పొదిగారు. కొన్నిచోట్ల మాత్రం శ్రీ గజానన జాగీర్దార్ తిలక్‌గా కనబడతారు.

"అమ్మా! అమ్మా! పాపం వాడెవడో బయట గోల పెడుతున్నాడమ్మా. వాడికేమైనా ఇద్దామా?"

"నా తండ్రే అలాగే ఇద్దాం. పాపం ఏమిటి వాడిగోల?"

"పీచుమిఠాయి కానీ కానీ అని."

## సినీ టెక్నీషియన్ల సంఘం

దక్షిణభారత సినీ టెక్నీషియన్ల సంఘం సర్వసభ్య సమావేశం జులై 15 న జరిగింది. అధ్యక్షుడు శ్రీ కృష్ణన్ మాటాడుతూ అఖిలభారత స్థాయిలో సినీ టెక్నీషియన్ల సంఘాన్ని ఏర్పాటు చేయడానికి కృషి జరుగాలన్నారు.

సంఘ కార్యదర్శి శ్రీ సబ్యసిన్ రజనీకాంత్ వార్షికనివేదికను సమర్పించారు.

అనంతరం కొత్తసంవత్సరానికి ఈ క్రింది కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు:

అధ్యక్షుడు: శ్రీ ఎ. కృష్ణన్, ఉపాధ్యక్షులు శ్రీ హరిపాఇచంద్ర, శ్రీ నిమయ్ ఘోష్, కార్యదర్శులు శ్రీ ఎన్. కృష్ణస్వామి, శ్రీ వి. శ్రీనివాసన్, కోశాధికారి శ్రీ సి. ఎ. రామకృష్ణన్.

## 'రక్తాశ్రులు' నాటకం

రవి ఆర్టు థియేటర్ (మద్రాసు) వారు జులై రెండోవారంలో "రక్తాశ్రులు" అనే నాటకాన్ని నెల్లూరులో రెండు రోజులు ప్రదర్శించారు. "ఏది నిజం" లో హీరో శ్రీసి. నాగభూషణం ఈ ప్రదర్శనాలను నిర్వహించారు. 'రక్తకన్నీరు' అనే తమిళ నాటకం దీనికి మాతృక. శ్రీ పాలగుమ్మి పద్మరాజు దీనికి మాటలు వ్రాశారు. నాటక ప్రదర్శనలో తమిళులు కొత్తపద్ధతులు అవలంబించి, మంచి ఫలితాలు సాధించారు. ఇప్పుడు నాగభూషణం ఈ నాటకం విషయంలో ఉత్సాహంతో కృషిచేసి కొత్త పద్ధతులలో వివిధ సన్నివేశాలను చిత్రించారు. ఇందులో నాయకభూమికను ఆయనే నిర్వహించారు. జయశ్రీ, లలితకుమారి, రామతిలకం, సత్యవతి, భ్రమరాంబ, శ్రీ రమణమూర్తి, కొండా శేషగిరిరావు, వి. నాగేంద్రరావు, ఎం. సర్వారావు మొదలైనవారు పాల్గొన్నారు. నాటక ప్రదర్శనాశిల్పంలో కొత్తదనాన్ని అన్వేషించే నాగభూషణంగారి ప్రయత్నం నెల్లూరులో ప్రశంసలందుకొంది. దీన్ని పురస్కరించుకునే, ఆంధ్రలోని వివిధ కేంద్రాలలో ఈ నాటకాన్ని ప్రదర్శించాలని, రవి థియేటర్సు సంకల్పించారు.

* * *





గురుదత్ కొత్తచిత్రం "సి. ఐ. డి" లో దేవానంద్.

డిటెక్టివ్ సీరియల్

మూలం: ఎడ్గార్ వాలెస్

# అరుణవలయం

అనువాదం: "ప్రద్యుమ్న"

(గత అధ్యాయం తరువాయి)

థాలియా డ్రమండ్ తన బసలో అప్పుడే భోజనం పూర్తిచేసి, చిరిగిన మేజోళ్లు కుట్టుతూ కూర్చున్నది. ఆమె ఆలోచనలు మళ్ళీమళ్ళీ జాక్ బియర్డ్ మోర్ పైకి పోతున్నాయి. అతన్ని గూర్చి ఆలోచించకుండా ఆమె విశ్వప్రయత్నం చేస్తోంది. అతని ఆలోచన వచ్చినప్పుడెల్లా ఆమెకు తీవ్రమైన బాధ తప్ప మరే అనుభూతి కలగడం లేదు. ఇలా ఒంటరిగా, ప్రశాంతంగా కూర్చున్నప్పుడెల్లా ఆమెకు అతని ఆలోచనలే వస్తాయి. వాటినుంచి తప్పించుకోవడానికని కుడుతున్న మేజోళ్లు అక్కడే పారేసి మరేదైనా పనిచేద్దామని అనుకున్నది. ఇంతలో బెల్ మోగింది.

ఆమె తలుపు తెరిచింది. ఎవరో వార్తాహరుడు ఆమెకొక నలుచదరంగా ఉన్న పార్సెలు ఇచ్చాడు. అది బూట్లు పెట్టుకునే పెట్టెలాగా ఉంది.

పైన ఆమె పేరు, చిరునామా అచ్చు అక్షరాల్లో ఉన్నాయి. అది చూడగానే పార్సెలు ఎవరు పంపించిందీ ఆమె కర్థమైపోయింది. ఆమె హృదయం వేగంగా కొట్టుకున్నది.

తిరిగి గదిలోకి వచ్చి దారాలు కోసి పెట్టె తెరిచింది. పై భాగాన ఒక కార్డు ఉన్నది. అది అరుణ వలయం పంపిన సందేశం.

"నీకు ఫ్రాయంట్ ఇంట్లోకి దోవ తెలుసు. అతని పఠనాగారం దిగువ బాంబ్ ప్రూఫ్ గది ఒకటి ఉన్నది. అందులోకి తోటలోంచి దారి ఉన్నది. ఈ పెట్టెలోని వస్తువులతో సహా లోపలికి ఎలాగో వెళ్ళు. నేను మళ్ళీ నీకు చెప్పే వరకూ ఆ భూగర్భ గృహంలోనే వేచి ఉండు."

పెట్టెలోని వస్తువులు తీసింది. ఒకటి పురుషులు ధరించే పెద్ద సైజు గ్లోవ్. అది ఎడమ చేతిది. మరొకటి పొడుగాటి బాకు. దాని మొనసూదిగా, అంచు పదునుగా ఉన్నది. ఈ రెండూ తప్ప పెట్టెలో ఇంకేమీ లేవు. వాటికేసి చూస్తూ చాలసేపు కూర్చుంది. తరువాత లేచి టెలిఫోను వద్దకు వెళ్ళి ఏదో నంబరు చెప్పింది. కొంతసేపు వేచిఉంది. కాని ఆ నంబరు నుండి సమాధానం రావడం లేదని ఆపరేటరు చెప్పడంతో రిసీవరు పెట్టేసింది.

చేతి గడియారం చూసుకుంది. ఎనిమిది దాటింది. ఆమె తొమ్మిదింటికి ఫ్రాయంట్ ఇంట్లో ఉండాలి. వ్యవధి లేదు. చేతి సంచీలో గ్లోవ్, బాకు పెట్టుకుని పొడుగాటి ఓవర్ కోటు ధరించి బయటికి వెళ్ళింది.

అరగంట తరవాత, ఇన్‌స్పెక్టర్ పార్, డిటెక్టివ్ యేల్ ఫ్రాయంట్ భవనం మెట్లెక్కారు. ఒక నౌకరు వారిని లోపలికి ప్రవేశపెట్టాడు. ఇల్లంతా విద్యుద్దీపాలతో ప్రకాశిస్తోంది. హాలులో అన్ని లైట్లూ వెలుగుతున్నాయి. పైన మెట్ల వద్ద కూడా లైట్లు వెలుగుతున్నాయి. పరమలోభియైన హార్వే ఫ్రాయంట్ అన్ని లైట్లూ వెలిగించి ఉంచడం విశేషమేనని డెరిక్ యేల్ తలపోశాడు. సాధారణంగా ఫ్రాయంట్ హాలులో ఒక చిన్న లైటు మాత్రమే వెలిగించి ఉంచుతాడు. అవసరమైనప్పుడూ మిగతా ప్రతిగదీ చీకటిగానే ఉంటుంది.

పఠనాగారానికి హాలులోంచి దోవఉంది. తలుపులు బార్లా తెరిచిఉన్నాయి. ఆగదిలో కూడా అన్ని లైట్లూ వెలుగుతున్నాయి.

డెస్కు వద్ద హార్వే ఫ్రాయంట్ కూర్చుని ఉన్నాడు. అలిసిపోయి ఉన్నట్టున్న అతని ముఖంపై చిరునవ్వు తొలకాడుతున్నది. గొప్ప ఘనకార్యం చేయబోతున్నట్టు అతని ముఖంలో గర్వం కనిపిస్తోంది.

"రండి, రండి. మీకు ఒక ముఖ్యమైన విషయం చెప్పబోతున్నాను. అదివిని మీరు విపరీతమైన సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోక తప్పదు," అని ఫ్రాయంట్ ముసిముసిగా నవ్వుతున్నాడు. "నేను ఇంతకు ముందే చీఫ్ కమీషనరును కూడా టెలిఫోనులో పిలిచాను" అని పార్ తో అన్నాడు. "ఇటువంటి సందర్భాలలో కొంచెం జాగ్రత్తగా ఉండడం అవసరం. మీరు మళ్లీ ఈ గృహంనుంచి వెళ్ళిపోయేటప్పుడు మీకు ఏ ప్రమాదం సంభవించినా సంభవించవచ్చు. మన రహస్యం ఎక్కువమందికి తెలియడం మంచిది కాదుగదా! మీరు మీ ఓవర్ కోట్లు విప్పేయవచ్చు. నేను విషయమంతా చెప్పడానికి చాలాసేపు పడుతుంది."

ఇంతలో టెలిఫోను బెల్ మోగింది. ఫ్రాయంట్ రిసీవరు తీశాడు.

"ఆ, ఎవరు, మీరా, కర్నల్! మరే నేను మీకు ఒక ముఖ్యమైన వర్తమానం చెప్పవలసివుంది. మరో రెండు నిమిషాల్లో మిమ్మల్ని పిలుస్తాను. మీరక్కడే ఉంటారుగా. మంచిది" అని రిసీవరు మళ్ళీ పెట్టేశాడు. ఏదో సందిగ్ధంలో ఉన్నట్టు కనుబొమలు ముడిచి ఆలోచించాడు. తరువాత ఇలా అన్నాడు.

"నేనిప్పుడు చీఫ్ కమీషనరుతో మాట్లాడాలి. మీరు మరోలా భావించక అవతలిగదిలోకి వెళ్ళండి. తలుపు వేసెయ్యండి. ఇప్పుడు నేను మాట్లాడబోయేది మీకు ముందే తెలిసిపోకూడదు. మిమ్మల్ని ఒక్కసారిగా ఆశ్చర్యంలో ముంచివేయాలని నా ఉద్దేశం."

"అలాగే" అని పార్ గదిలోంచి వచ్చేశాడు.

డెరిక్ యేల్ సంకోచిస్తూ నిలబడ్డాడు. "మీరిప్పుడు చెబుతామన్నది అరుణ వలయం గురించేనా?" అని అడిగాడు.

"నేను చెబుతానన్నానుగా, తొందరపడకండి. ఒక్క అయిదు నిమిషాలు ఓపిక పట్టండి. మీకు ఎలాంటి రహస్యాలు చెబుతానో చూదురుగాని," అన్నాడు ఫ్రాయంట్.

డెరిక్ యేల్ నవ్వాడు. అప్పుడే హాలులోకి అడుగుపెడుతున్న పార్ కూడా చిరునవ్వు నవ్వుకున్నాడు.

"మీరు చెప్పేది ఎంత గొప్ప రహస్యమైనా నన్ను ఆశ్చర్యపరచలేదు", అన్నాడు యేల్.

యేల్ గదిలోంచి వచ్చేస్తూ తలుపు పట్టుకుని వేసెయ్యబోతూ నిలబడి ఫ్రాయంట్ తో "మీరు చెప్పేది చెప్పాక, మీకు థాలియా డ్రమండ్ ను గూర్చి కొన్ని అద్భుత విషయాలు చెబుతాను. ఓ, మీకు అది అద్భుతంగా కనిపించకపోవచ్చు. కాని వింటే మీకే తెలుస్తుంది నేను చెప్పేది అద్భుతమో, మీరు చెప్పేది అద్భుతమో" అన్నాడు.

డెరిక్ యేల్ ముఖంలో చిరునవ్వు చూసి థాలియా విషయం వినడానికి ఫ్రాయంట్ ఆసక్తి ఏమీ కనపరచ లేదని పార్ అనుకున్నాడు. యేల్ తలుపు మూసి ఇవతలికి వచ్చాడు.

"పార్! ఇతడు చెప్పేదేమై ఉంటుంది? కర్నల్‌తో మాటాడాలన్నాడు, ఏమిటో అది?" అని యేల్ అన్నాడు.

ఇద్దరూ డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్లారు. అక్కడకూడా అన్ని లైట్లూ వెలిగించి ఉన్నాయి. అక్కడ ఫ్రాయంట్ బట్లరు సీర్ అనేవాడున్నాడు. వాణ్ని చూసి "స్సీర్! ఇవ్వాళేమిటే విశేషం?" అని యేల్ అడిగాడు.

"ఏమోనండి తెలియడం లేదు. మిస్టర్ ఫ్రాయంట్ సాధారణంగా కరెంటు ఖర్చు చేయరు. ఇవాళ ఎందుకో మరి లైట్లన్నీ వెలిగించి ఉంచాలని, ఎటుపోయి ఎటువస్తుందోనని జాగ్రత్తగా ఉండాలని మమ్మల్ని హెచ్చరించారు. ఇలాంటిదెప్పుడూ జరగలేదు మరి. అన్నిటికంటే, జేబులో రెండు నిండు రివాల్వర్లు పెట్టుకొని ఉన్నాడాయన, అదే ఆశ్చర్యంగా ఉంది. ఆయనకి అవి దగ్గరుంచుకునే అలవాటులేదు," అని బట్లరుసీర్ చెప్పాడు.

"ఆయనదగ్గిన రివాల్వర్లు ఉన్నాయని నీకెలా తెలుసు?" పార్ తీవ్రకంఠంతో ప్రశ్నించాడు.

"వాటిల్లో తూటాలు నేనే నింపిఇచ్చాను గనక." అని బట్లర్ సమాధానమిచ్చాడు.

డెరిక్ యేల్ ఈలపాటపాడుతూ పార్ వంక చూశాడు.

"బహుశా అరుణాలయంనుండి ఎవడైనా రావచ్చునని ఫ్రాయంట్ అనుమానిస్తున్నాడలేఉంది," అన్నాడు యేల్. "అన్నట్టు, మనుషుల్ని ఎవర్నయినా కాపలా ఉంచావా?"

"వీధిలో ఇద్దరు డిటెక్టివులను అట్టే పెట్టాను. అవసరమైతే వెంటనే రావలసిందని ఆజ్ఞాపించాను," అని పార్ చెప్పాడు.

గది తలుపులు వేసి ఉండటంవల్ల, గోడలు చాలా దృఢంగా, మందంగా కట్టినవి కావటంచేత ఫ్రాయంట్ టెలిఫోనులో మాట్లాడుతున్న శబ్దమేమీ వినిపించలేదు.

ఒక అరగంట గడిచింది. డెరిక్ యేల్‌కు విసుగుపుట్టింది.

"స్సీర్! పోయి చూసివస్తావా, ఆయనేమి చేస్తున్నాడో?" అని అడిగాడు.

"నేను వెడితే ఆయన తిడతారండి. పిలిస్తేగాని మేము వెళ్లము. మీరు వెళ్ళి చూసిరండి."

పార్ మెల్లిగా ముందుకువెళ్లి, ఏదో అనుమానం తట్టినట్లయి గభాలున తలుపులు తెరిచాడు. లైట్లు దేదీప్యమానంగా వెలుగు



రామేశ్వరాలయమండప శిల్పం
ఫొటో: నివ్వాణిగిరిధర్.



# వరదల ప్రళయం





ఈ మాసం మొదటివారం సూళ్లూరుపేట, గూడూరు, నాయుడుపేట ప్రాంతంలో బ్రహ్మాండమైన వానలుకురిసి, చెరువులూ, వాగులూ వీటిపై వరదలు సంభవించాయి. అనేక గ్రామాలు కొట్టుకుపోయి చాలా ఆస్తినష్టం, వరదల్లో 65 మందికి పైగా జననష్టం కలిగాయి. కలకత్తా-మద్రాసు రైలుమార్గం దెబ్బతినడం మూలంగా సూళ్లూరుపేటలో నిలిచిపోయిన గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ ప్రయాణీకులను పడవల్లో అక్కంపేటకు చేరవేయడం, అక్కణ్ణించి మద్రాసు ప్రయాణీకులు ప్రత్యేక రైలును ఎక్కుతూ ఉండడం ఈ చిత్రాల్లో చూడవచ్చు



అందుచేత కొంచెం గుచ్చి గుచ్చి అడుగుతున్నాను. ఆ తలుపు చప్పుడు కాకుండా తీయడానికి వీలుందా?"

"ఆ. నిశ్శబ్దంగా తీయవచ్చును. సరే, ఈ ఉత్తరాలు దేనికైనా సమాధానాలు రాస్తారా?"

యేల్ ఉత్తరాలన్నీ పక్కకి తోసేశాడు.

"మిస్ డ్రమండ్! రాత్రి నువ్వేం చేస్తున్నావు?' సూటిగా ప్రశ్నించాడు డిటెక్టివ్.

"ఇంటి దగ్గిరే ఉన్నాను" అంటూ చేతులు వెనక్కి పెట్టుకున్నది. ఆమె ఒళ్ళంతా ఒక్కసారిగా బిగుసుకున్నట్లు అతడు కనిపెట్టాడు.

"రాత్రంతా ఇంటి దగ్గరే ఉన్నావా?"

ఆమె సమాధానం చెప్పలేదు.

"రాత్రి ఎనిమిదిన్నరకి నువ్వు ఒక చిన్న పార్సిలు చేతులో పట్టుకుని ఎక్కడికో వెళ్ళిలా?"

ఆమె ఇంకా సమాధానం చెప్పలేదు.

"నా అసిస్టెంటు ఒకడు నిన్ను చూశాడులే," అని నిర్లక్ష్యంగా అన్నాడు యేల్. "ఆ తరవాత నువ్వు అతని చూపు తప్పించుకుని ఎటు పోయావో పోయావట. రాత్రి పదకొండు గంటల ప్రాంతానికిగాని నువ్వు ఇంటికి తిరిగి రాలేదట."

థాలియా తొణకకుండా "నేను షికారుగా అలా వెళ్ళాను. లండను నగరపటం ఇలా ఇస్తే నే వెక్కడెక్కడ తిరిగిందీ గీసి చూపిస్తాను," అని జవాబిచ్చింది.

"నువ్వు గీసి చూపించకుండానే తెలిసిందిలే."

"అయితే నాకు శ్రమ తప్పించారన్నమాట."

డెరిక్ యేల్ బల్లమీద ముందుకు వొరిగి ఇలా అన్నాడు: "మిస్ డ్రమండ్! ఇదిగో విను. నువ్వు నిజంగా నేరస్థురాలివి కాదని నాకు తెలుసు. ఏం, ఆమాటకు ఉలిక్కిపడుతున్నావా? నిజమే. కొంచెం తీవ్రమైన మాటే అది. అయినా నిన్ను అనుమానించడానికి తగిన బలవత్తరమైన ఆధారాలున్నాయి. నేనింకా అవన్నీ పార్‌తో చెప్పలేదనుకో."

"అనుమానించబడడం నాకు బాగా అలవాటైనదే. సరే, నన్నుగూర్చి మీకు అంతా తెలిసిపోయినప్పుడు ఇంకా నన్ను ప్రశ్నించడం దేనికి?" అన్నది థాలియా.

అతడు ఆమెకేసి తీవ్రంగా చూశాడు. ఆమెకూడా అతనికేసి అంత తీవ్రంగానూ చూసింది. చివరికతడు బుజాలెగరేసి,

"నువ్వు రాత్రి ఎక్కడుండి ఉండినా ఒకటేలే" అన్నాడు.

"అవును. అదే నిజం" అన్నదామె. తను పని చేసే గదిలోకి వెళ్ళి టైపురైటరు

ముందుకూర్చున్నది.

"చాలా విచిత్రమైన వ్యక్తి" అనుకున్నాడు యేల్.

అతనికి స్త్రీలమీద మామూలుగా ఆసక్తి కలగదు. కాని థాలియా డ్రమండ్ సాధారణ స్త్రీగా కనబడ లేదు ఆమె చక్కని చుక్క అన్న సంగతి అతనికి తెలుసు. అయినా ఆమె అందానికి కాదు ముగ్ధుడైనది

మళ్ళీ వార్తాపత్రిక తీశాడు. పోలీసు అధికారుల అసమర్థత గూర్చి వ్రాసిన వ్యాఖ్యలు మళ్ళీ చదివాడు. ఇంతలో అతడు అనుకుంటున్నట్లుగానే ఇన్‌స్పెక్టర్ పార్ తొందరగా లోనికివచ్చి, ఒక కుర్చీలో కూలబడి కూర్చున్నాడు.

"నన్ను రాజీనామా ఇవ్వమని కమీషనర్ కోరాడు" అని పార్ చెప్పాడు. అతని కంఠంలో ఉత్సాహం యేల్‌కు ఆశ్చర్యం కలిగించింది. "నేనేమీ బాధ పడడం లేదు. నేనసలు నా సోదరుని ఆస్తి నాకు కలిసినప్పటినుంచీ, అంటే మూడేళ్ళనుంచీ ఎలాగూ రిటైరవుదామనే ఆలోచిస్తున్నాను."

పార్ ధనవంతుడని సూచన మాత్రంగానైనా డెరిక్ యేల్‌కు ఇప్పుడే తెలిసింది.

"అయితే ఏం చేయబోతున్నావు?"

పార్ నవ్వాడు "మిత్రమా! ప్రభుత్వ ఉద్యోగాలలో రాజీనామా ఇచ్చెయ్యమంటే ఇచ్చివేయక గత్యంతరం లేదు. కాని నా రాజీనామా వచ్చే నెలాఖరు నుంచీ గాని అమలులోకి రాదు. ఈలోగా, నీపనేమవుతుందో చూడాలిగా?"

"నాపనా?" అని యేల్ ఆశ్చర్య పడినాడు. "అదా? నాలుగో తారీకున నన్ను చంపి వేస్తామని అరుణవలయం బెదిరిస్తూ రాసిన ఉత్తరం సంగతా? అవునవును, మరే. చూడనియ్, ఇంకా రెండు మూడు రోజులు మాత్రమే నాకు గడువు ఉన్నదన్న మాట." కాలెండరు కేసి చూస్తూ హేళనగా అన్నాడు యేల్." అయినా నా కోసం నువ్వు ఆగనక్కరలేదులే. అసలు నువ్వు రాజీనామా ఇవ్వడం దేనికి? నన్ను కమీషనర్‌తో మాట్లాడ చూడమంటావా?"

"ఎందుకు, వృథాప్రయాస? నీ మాటలాయన ఖాతరు చెయ్యడు. అయినా, రాజీనామా అమలులోకి వచ్చే తేదీ దాకా నన్ను కేసులోంచి ఆయన తొలగించడు. దానికి న్యాయంగా నీకు కృతజ్ఞత తెలుపుకోవలసి ఉంది," అన్నాడు పార్.

"నాకా?"

ఇనస్పెక్టరు లోలోపల నవ్వుకున్నాడు.

"దేశానికి నీ ప్రాణం చాలా అమూల్యమైనదని, అందుచేత నువ్వు సురక్షితంగా ఆరోజు దాటేవరకూ నేను పనిలోనే ఉండడం అవసరమనీ కమీషనర్‌కు నచ్చచెప్పాను. ఆయన ఒప్పుకున్నాడు."

మరికొన్ని ఉత్తరాలు పట్టుకుని థాలియా డ్రమండ్ లోపలికి వచ్చింది.

"ఓ, మిస్ డ్రమండ్!"

ఇన్‌స్పెక్టరు తలఎత్తి ఆయువతి వంక చూశాడు.

"ఈ ప్రొద్దుటి పేపర్లలో మీగురించి చాలా పడింది. మీరు గొప్పవాళ్ళైపోతున్నారల్లే ఉంది, మిస్టర్ పార్!" అన్నది థాలియా.

"ఏదో ఓరకంగా నాకీర్తి ప్రచారం అవుతోందిగదా! సరేగాని, నీపేరు పేపరలో చూసి చాలా రోజులైంది మిస్ డ్రమండ్!" థాలియామీద ఇదివరకు వచ్చిన దొంగతనం కేసును మనస్సులో పెట్టుకుని ఇన్‌స్పెక్టర్ పార్ ఆమాట అన్నాడు.

"దానికేముంది, సమయం వచ్చినప్పుడు నా పేరు కూడా పేపర్లలో ప్రచారమవుతుంది," అని వ్యంగ్యంగా సమాధానమిచ్చి "అరుణవలయాన్ని గూర్చి కొత్త విశేషాలేమన్నా కనిపెట్టారా?" అని అడిగింది.

పార్ నెమ్మదిగా జవాబిచ్చాడు: "ఏముంది, మిల్‌డ్రెడ్ వీధికి ఇంతవరకూ వేస్తున్న అరుణవలయం లేఖలు ఇకమీద మరో చిరునామాకు వెళతాయి. అంతే."

ఆమె ముఖం క్షణకాలం అదోమాదిరిగా అయిపోయింది. కాని మరుక్షణంలో తెప్పరిల్లింది ఇన్‌స్పెక్టర్ పార్ ఆ మార్పుకని పెట్టకపోలేదు.

థాలియా నిర్భయంగా ఇలా అడిగింది. "అరుణవలయంవారు నగరంలోనే ఆఫీసు కూడా పెడుతున్నారా? ఏం ఎందుకు పెట్టకూడదు? వాళ్ళు చెయ్యలేని పని అంటూ లేనట్టు కనిపిస్తోంది. శుభ్రంగా పెద్దభవనం ఒకటి అద్దెకు తీసుకుని విద్యుద్దీపాకృతులతో తమ ముఠా పేరుకూడా బోర్డుకట్టి తగిలించుకోవచ్చును. ఏమంటారు? అయితే, విద్యుద్దీపాలబోర్డు పెడతారనుకోనులెండి. ఎందుకంటే ఆఖరికి పోలీసులకి కూడా అబోర్డు కనిపించిపోతుంది."

"నీలాంటి యువతి హేళన చెయ్యడం అసహ్యంగా, అసభ్యంగా ఉంటుంది, తెలుసా?" పార్ తీవ్రంగా అన్నాడు.

ఈసంభాషణం అంతా డెరిక్ యేల్ వింటూ వినోదిస్తున్నాడు. థాలియా ధైర్యం అతనికి ఆశ్చర్యం కలిగించింది కాని పార్ ధోరణి కూడా అంత ఆశ్చర్యమూ కలిగించింది. పార్‌లో ఇంత ద్వేషపూరితమైన వ్యంగ్యం ఉందని అతనెన్నడూ భావించలేదు.

"మిస్ డ్రమండ్! గడచిన రాత్రి నువ్వెక్కడున్నావు?" పార్ తేలకేసి చూస్తూ అడిగాడు.

"నా బసలో పడుకుని కలలు కంటున్నాను."

"అయితే నీకు నిద్రలో నడిచే అలవాటుందన్నమాట! రాత్రి తొమ్మిదిన్నరకి ఫ్రాయంట్ ఇంటి వెనక నువ్వు సంచరించుతున్నప్పుడు నిద్రపోతూ నేవున్నావా?"

"ఓ అదా? అక్కడ తోటలో నా కాలి జాడలు కనిపించాయిగదూ? మిస్టర్ యేల్ కూడా నా కాలి జాడల ప్రసక్తి తీసుకొచ్చారిందాక? అక్కడ నా కాలిగురు తులెందుకున్నాయంటే, రాత్రి ఏమీ తోచక అలా పార్కులో షికారుగా తిరిగివద్దామని వెళ్ళాను. కాసేపు ఒంటరిగా ఉంటే హాయిగా ఉంటుందని అనిపించి వెళ్ళాను"

పార్ ఇంకా తివాచీ వంకనే తీవ్రంగా చూస్తూ అన్నాడు:

"అమ్మాయ్! ఈ సారి పార్కులో షికారుగా తిరిగేటప్పుడు జాక్ బియర్డ్‌మోర్‌కి కొంచెం దూరంగా తిరుగుతూ ఉండు. కిందటిసారి నువ్వు అతన్ని వెంబడించి అనవసరంగా భయపెట్టావు."

ఈ దెబ్బతో థాలియా తలకిందులైంది. గుక్క తిప్పుకోలేకపోయింది. ఆమె ముఖం అరుణరాగ రంజితమైంది.

"మిస్టర్ బియర్డ్‌మోర్ అంత తేలికగా భయపడే మనిషి కాదులెండి. అదిగాక – అదీగాక"——

వాక్యంపూర్తిచేయకుండా ఆమె హఠాత్తుగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది. యేల్‌తో మరికొంతసేపు మాట్లాడి పార్ బయటి గదిలోకి ఆమె తలఎత్తి చూచి క్రోధగద్గదిక స్వరంతో ఇలా అంది:

"ఇన్‌స్పెక్టర్! ఒక్కొక్కసారి మీ ధోరణి చూసి పట్టరాని ద్వేషం కలుగుతుంది."

"నామీదనా ద్వేషం!" అన్నాడు పార్ ఆశ్చర్యపడుతున్నట్లు నటిస్తూ.

(ఇంకా ఉంది)

# చిత్రకారుని నమూనా

ధనవంతుడైతే తప్ప ఆకర్షణీయంగా ఉండి ప్రయోజనంలేదు. శృంగారం ధనవంతుల సొత్తేకాని నిరుద్యోగుల వృత్తేం కాదు. నిర్ధనులు వాస్తవ ప్రపంచానికి దగ్గరగా ఉండి అందులోనే జీవించాలి అందంగా ఉండడంకంటే సాలుకింత అని ఒక నమ్మకమైన ఆదాయం ఉండడమే మెరుగు. ఇవి హాగ్ ఎర్స్కిన్‌కి తెలియని ఆధునిక జీవితపు నగ్న సత్యాలు అతను పెద్ద తెలివైనవాడు కాదు. కాని చాలా అందగాడు. తీర్చిదిద్దినట్టుండే ముఖం, విశాల నయనాలు చక్కని శిరోజాలు, సౌష్టవంగా సౌందర్యంతో ఒప్పే శరీరం.

స్త్రీలలోను పురుషులలోను కూడా కలివిడిగాను చనువుగాను తిరిగేవాడు. అతనికన్నీ ఉన్నాయ్. కాని ఒక్కటే లోపం. ధనార్జనకనువైన విషయాలతనికే తెలియవు. అతనికి తండ్రివల్ల సంక్రమించినవల్లా రాజలాంఛనమైన పాతఖడ్గం ఒకటి, రెండోది పదిహేను భాగాలుగా ఉన్న "ద్వీపకల్పయుద్ధచరిత్ర" - మొదటిదాన్ని తన నిలువుటద్దంపైన వ్రేలాడగట్టాడు. రెండవదాన్ని భద్రంగా షెల్ఫులో యితరపుస్తకాల మధ్య పదిలపరిచాడు. అతని జీవనాధారం; ఒక ముసలి మేనత్త సాలీనా యిచ్చే రెండు వందలు మాత్రమే. అతను ధన సముపార్జనా ప్రయత్నాలు చాలా చేశాడు. కాని ఒక్కటి కూడా కొనసాగలేదు. ఆరునెల్లు స్టాక్ ఎక్స్ఛేంజిలో పనిచేశాడు. సుకుమారమైన కుసుమం రాక్షసహస్తాలలో ఎల్లా ఉండగలదు? కొన్నాళ్లు అదిమానేసి టీ వర్తకం చేశాడు కాని అదీ గిట్టుబాటు కాలేదు. చివరకి తనకు తానుగానే మిగిలిపోయాడు. చక్కని సౌందర్యప్రతిమ. వృత్తి ఉద్యోగాలు లేవు.

గోరుచుట్టుమీద రోకటిపోటులా ప్రేమ జ్వరం ఒకటి పట్టుకుందతనికి. అతని ప్రేమ పెన్నిధి లారామెర్టన్ నామాభిధాన. రిటైరైన కర్నల్ కూతురు. కర్నల్ తన అహంభావం, జీర్ణశక్తికూడా హిందూదేశంలో కోల్పోయాడు. స్వదేశానికి తిరిగివచ్చినా అవి మాత్రం తిరిగిరాలేదు.

లారా హాగ్‌కి ఆరాధ్య దైవం. అతనామె నడిచిన భూమి ముద్దుపెట్టుకునేందుకు కూడ సిద్ధమయేవాడు. వారిద్దరు కూడితే లండన్ అంతటికీ తలమానికంగా ఉండే మిథునం అవుతారు. కర్నల్ గారికి హాగ్ అంటే ప్రేమ. కాని అల్లుడుగా అంగీకరించడం అంటే అది వేరవిషయం!

"ఇదుగో అబ్బాయ్ నువ్వు పదివేలపౌన్ల ఆస్తి గణించిన రోజున రా నా దగ్గరికి. అప్పుడు ఆలోచిద్దాం." అనేవాడు. హాగ్ ఎంతో చిన్నబోయి లారా దగ్గరకు పరుగెత్తేవాడు అనునయ సానుభూతులకోసం.

ఒక మధుర ప్రభాతాన హాలండ్ పార్కులో ఉన్న లారా ఇంటికి వెడుతూ దారిలో స్నేహితుడు అలన్ ట్రెవర్ దగ్గరకొకసారి వెళ్ళాడు. ట్రెవర్ ఒక చిత్రకారుడు. ఈ రోజుల్లో ప్రతీ వాడూ పెయింటరే అనుకోండి! కాని ట్రెవర్ నిజమైన కళాకారుడు కూడాను. మనిషిమాత్రం మహా మోటుగా ఉంటాడు. గంట్లుపడ్డ ముఖం...! జీబు గడ్డం...! కాని కుంచె పుచ్చుకుంటే మాత్రం అతనికతనే సాటి. అతనొక అమోఘమైన తైలవర్ణ చిత్రకారుడు. అతని చిత్రాలంటే అంతా ఎగబడేవారు.

హాగ్ విషయంలో మొదట ట్రెవర్‌నాకర్షించినది హాగ్ సౌందర్యం మాత్రమే. "కళాకారులకు పరిచయం కాదగిన వ్యక్తులెవరంటే-" అంటూ యిల్లా ఉపన్యాసం దంచేవాడు. "కళాకారుల దృష్ట్యా సౌందర్యవంతులై ఉండాలి కాని పెద్ద తెలివి కలిగి అతివాగుడు రకాలు కాకూడదు." కాని పరిచయం అధికమైనకొద్దీ అతని ఉదార ప్రకృతి ఉత్సాహం ట్రెవర్‌కి ఎక్కువ సన్నిహితుణ్ణి చేశాయి. తన స్టూడియోలో స్వేచ్ఛగా తిరగడానికనుమతిచ్చాడు.

హాగ్ వచ్చేటప్పటికి ఒక భిక్షుకుడి నిలువెత్తు చిత్రానికి చివరి మెరుగులు దిద్దుతున్నాడు ట్రెవర్. ఆ భిక్షుకుడు స్టూడియోలోనే ఒక మూల ఎత్తైన వేదికమీద నిలబడి వున్నాడు. ఆ బికారి ముసలితనంలో ముడతలుపడ్డ దేహంతో మహాదయనీయంగా ఉన్నాడు. అతని వంటిని శత సహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణమైన బూడిదరంగు కోటొకటి ఉంది. ఎప్పుడో పారెయ్యవలసిన బూట్లు లక్ష అతుకులతో ఉన్నాయి. ఒక చేతో కర్ర నానుతూ రెండో చేతో టోపీ పట్టుకున్నాడు భిక్షా పాత్రగా.

"అబ్బ ఏం నమూనా?" గొణిగాడు హాగ్ ట్రెవర్‌తో చేతులు కలుపుతూ.

"ఏం ఎందుకంత ఆశ్చర్యం" గొంతు చించుకున్నాడు ట్రెవర్. "నిజమే! ఇలాంటి భిక్షుకులు రోజూ దొరకరు. ఇది నా డిస్కవరీ. ఓహ్! ఎంత చక్కని రెంబ్రాండ్ గా చిత్రించేవాణ్ణితణ్ణి?"

"ప్చ్! పాపం! ఎంత హీనంగా ఉన్నాడు! కాని కళాకారులైన మీకా ముఖం 'నిధి' అనుకుంటా" అన్నాడు హాగ్ జాలిగా.

"తప్పకుండాను. భిక్షుకుడు హీనంగానే ఉంటాడు. ఉండాలి. తెలుసా?"

"ఒకసారి నమూనాగా అల్లా నిలబడినందుకెంతిస్తారు వాళ్ళకి?" అని అడిగాడు హాగ్ సోఫామీద సుఖాసీనుడౌతూ.

"గంటకో షిల్లింగ్."

"ఈ చిత్రానికెంతవస్తుంది?"

"ఓ దీనికి రెండు వేలొస్తుంది."

"పౌన్లా?"

"గినీలుబాబూ గినీలు. కవులకీ చిత్రకారులకీ వైద్యులకీ లెక్క గినీలలో."

"అయితే యీ నమూనాలకి తప్పకుండా మీ లాభాలలో భాగాలుండాలి. వాళ్ళూ మీ అంత కష్టమూ పడతారు." అన్నాడు హాగ్ నవ్వుతూ.

ని మొహం! రోజల్లా నిలబడి చిత్రం

మూలం:
ఆస్కార్ వైల్డ్

అనువాదం:
'ధనిష్ఠ'

#  చిత్రకారుని నమూనా 

గియడం ఎంత కష్టమో నీకేం తెలుసు? మాట్లాడితేవు వాలిక తిరిగినట్లులా ఒక్కొక్కప్పుడు కాయకష్టం చెయ్యడమే యింతకంటే సుఖమనిపిస్తుంది కాని నువ్వింక నోరుమూసుకో! నా పని చెడిపోతోంది చాలా తొందరగా ఉంది నిశ్శబ్దంగా సిగరెట్ కాల్చుకుంటూ కూర్చో" అంటూ పనిలో లీనమయ్యాడు మళ్ళీ

కొంతసేపటికి నౌకరొచ్చి ఫ్రేములు తయారుచేసేవాడొచ్చి అతనితో మాట్లాడాలన్నాడని చెప్పాడు

"హాగ్! ఎక్కడికీ ఉడాయించకు యిప్పుడే వస్తాను" అంటూ బైటకు నిష్క్రమించాడు

ట్రెవర్ బైటకు వెళ్ళిన క్షణంలో కాస్త విశ్రాంతిగా కాళ్ళుచేతులు విదిలించుకుని వెనకనున్న బెంచీకి చేరపడడానికి వీలు చిక్కిందా ముష్టివాడికి అతనిస్థితి ఎంతో దయనీయంగా ఉంది హాగ్ హృదయం ద్రవించింది జేబులు తడిమాడు ఒక బంగారుకాసు కొన్ని రాగినాణాలు ఉన్నాయి "పాపం! దరిద్రుడు! యీ డబ్బు నాకన్న వాడికెక్కువ అవసరం. కాని యిది నేనొదులుకుంటే ఒక పక్షం పాటు బగ్గీకి స్వస్తి చెప్పి కాళ్ళకు పని చెప్పాలి. పోనీ అయితే అయిందిలే" అని అనుకుని ఆ బిచ్చగాడి దగ్గరకెళ్ళి ఆ కాసు అతని చేతిలో ఉంచాడు

ఆ ముసలాడు అదిరిపోయాడు! విరిసీ విరియని చిరునవ్వొకటి వెలసిందాతని పెదవుల మీద "దణ్ణంబాబూ మీకెంతో కృతజ్ఞుణ్ణి" అన్నాడు రెండుసార్లు

ఇంతలో ట్రెవర్ లోనికిరావడంతో సిగ్గుతో కందినముఖంతో హాగ్ సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు లారాతో ఉల్లాసంగా గడిపి తన గుర్రాల ఖర్చుకు సన్నసన్నగా చివాట్లుతిని యింటికి నడిచి వెళ్ళిపోయాడు

రాత్రి తిరిగితిరిగి పదకొండింటికి క్లబ్బుకు చేరుకున్నాడు అతను అక్కడ ట్రెవర్ కులాసాగా వైన్ సేవిస్తూ ఉన్నాడు

"అయితే ఏ అడ్డూ లేకుండా ఆ చిత్రం బాగా పూర్తిచేశావా?" అన్నాడు హాగ్ సిగరెట్ ముట్టిస్తూ

"ఆహా! ఫ్రేమ్ కూడా కట్టించేశాను సరేగాని భలేపని జరిగిందే ఆ ముసలాడు అమాంతంగా నిన్ను ప్రేమించేశాడు నువ్వెవరివో, ఆదాయమెంతో, ఏంచేస్తుంటావో ఎక్కడుంటావో అన్నీ తెలుసుకునేదాకా విడిచిపెట్టలేదు"

"అయితే దారిలో నాకోసం కాచుకుని ఉంటాడన్నమాట నీకంతా వేళాకోళంగా ఉంది పాపం! ఎంత కష్టపడుతున్నాడో వాడికేదైనా ఉపకారం చెయ్యాలి అంత హీనంగా ఉండడం తల్చుకుంటే ఎంతభయం వేస్తుంది మాయింట్లో చాలా పాతబట్టలున్నాయి ఇస్తే తీసుకుంటాడంటావా? వాడు కట్టుకున్నవి తూటుపడి విడిపోడానికి సిద్ధంగా ఉన్నాయి"

"కాని ఆ దుస్తుల్లోనే వాడు మహా అందంగా ఉన్నాడు నాదృష్టికి లక్షవరహాలిచ్చినా వాణ్ణి విలువైన దుస్తుల్లో నేను చిత్రించను నీదృష్టిలో హీనంగా ఉన్నా ఆ చిరుగుబట్టలే నాదృష్టికి ఎంతో అందంగా ఉంటాయి ఏదైతే నీకంటికి నికృష్ట దారిద్ర్యంలాగ కనిపిస్తుందో అదే నాకంటికి అత్యంత సుందరదృశ్యం దానికేంగాని నీవస్త్ర సమర్పణ విషయం అతన్నడిగి చెప్తాను"

"అలస్! మీ కళాకారులకి హృదయం లేదు!" అన్నాడు హాగ్ సీరియస్ గా

"కళాకారులపని ఎంతవరకంటే ప్రపంచాన్ని చూసింది చూసినట్టు చిత్రించడం వరకే, సంస్కరించడం కాదు ఎవరి వృత్తి వారిది ఇంతకీ లారా ఏమంటోంది ఆ ముసలాడికి ఆవిషయంలో కూడ కుతూహలం ఎక్కువగానే ఉంది"

"అయితే ఆవిషయం కూడా వాడికి చెప్పావన్నమాట"

"నిశ్చయంగా మీకర్నల్ గారి విషయం లారా విషయం, ఆఖరికి ఆపదివేల పౌన్ల సంగతి అన్నీ కూడా తెలుసు వాడికి"

"అయితే నా ఆంతరంగిక విషయాలన్నీ కూడా ఆ ముష్టివాడికి నివేదించావన్నమాట" అన్నాడు హాగ్ కోపంగా, ఎరుపెక్కిన ముఖంతో

"అరెబాబూ! నువ్వనుకున్న ఆ ముసలి బికారి యూరప్ లో కల్లా గొప్ప ధనవంతులలో ఒకడు. కానీ అప్పుతీసుకోకుండా రేపు పొద్దున్నకి లండన్ అంతా కొనెయ్యగలడు. ఆయనకి అన్నిదేశాల ముఖ్యపట్నాలలోను మేడలున్నాయి బంగారు పాత్రలలో భుజిస్తాడు తల్చుకుంటే రష్యాచేత యుద్ధం విరమింపజెయ్యగలడు"

"ఏమిటి?" అన్నాడు హాగ్ కొయ్యబారిపోతూ

ఏమిటంటే యివాళ నువ్వు నా స్టూడియోలో చూసిన ముసలి బికారి బారన్ హాస్బర్గ్ నాకు ప్రాణమిత్రుడు నేను రాసే చిత్రాలు చాలాభాగం ఆయనే కొంటాడు. ఒక నెల్లాళ్ళ క్రితం తనని బికారి దుస్తులలో చిత్రించమని కోరాడు. ఏమిటంటావు? అదో వెర్రి కాని ఆయన నా దుస్తులలో గొప్ప నమూనాగా సరిపోయాడులే ఎప్పుడో స్పెయిన్ లో కుట్టించుకున్న పాతసూటు బలేగా అమిరింది" అని నవ్వేశాడు.

"వాడా! బారన్ హాస్బర్గ్! ఆయనకో బంగారు నాణెం నేను ముష్టివేశాను!" నిస్పృహగా కుర్చీలో కూలబడ్డాడు హాగ్.

"కాసు ముష్టివేశావా? శేష్ అబ్బాయ్. అదింక నీకు జన్మలో తిరిగిరాదు" అంటూ నవ్వుతూ దొర్లిపోయాడు.

"నేనంత మూర్ఖంగా ప్రవర్తించకుండా ముందే నువ్వు చెప్పి ఉండవలసిందోయ్" అంటూ హాగ్ చిరచిర లాడాడు.

"అబ్బాయ్, నువ్వొట్టి అతి తెలివిగా మాట్లాడకు ముందస్తుగా నువ్వు నాస్టూడియోకొచ్చి ముష్టి డబ్బులు పంచిపెడతావని నేనేం కలగన్నానా? అందంగా ఉన్న





అమ్మాయి నమూనాగా ఉంటే నువ్వు ముద్దు పెట్టుకున్నావంటే నమ్ముతాను. అంతేగాని ముసలి బికార్లకి దానాలు మొదలుపెడతావనుకున్నావా. అసలు ఇవాళ నువ్వొచ్చేటప్పటికి వాధోరణి కులాసాగా లేదు. అదీ కాకహాస్‌బర్ తన పేరు బయటపడడానికిష్టపడతాడో లేదో తెలీగు అతి నటువంటి దుస్థులో ఉన్నాడు నీకు తెలిసినట్టే!"

"నే నెంత వెర్రివెధవ ననుకున్నాడో ఆయన"

"అబ్బె అదేం లేదు నువ్వు వచ్చేసిన తరవాత ఎంతో కులాసాగా కనుపించాడు. ముడతలు పడ్డ చేతులు నులుముకుంటూ తనలో తనే నవ్వుకుంటున్నాడు. అతని కంత కుతూహలం ఎందుకో అప్పుడర్థం కాలేదు. ఇప్పుడంతా మంచు విడినట్లు కనిపిస్తోంది. నువ్వేం భయపడకు. ఆయన నా పేను వ్యాపారంలో పెట్టుబడిపెటి ఆర్నెల్లకో మాటు వడ్డీ పంపుతూ ఉంటాడులే. తరువాయి కథ చాలా ఉంది అది తెరమీద."

"ఛీఛీ ఎంత తెలివితక్కువ పని చేశాను. ఆకర్మ పొద్దున్నే ఎవరిముఖం చూశానో! ఇంటికెళ్ళి నిశ్శబ్దంగా కళ్లు మూస్తాను. బాబ్బాబు నీకు పుణ్యం ఉంటుంది. ఇది ఎక్కడా వెల్లడిచెయ్యకు. నలుగురికీ తెలుస్తే తలెత్తుకు తిరగలేను"

"నీ మొహం. నువ్వేం తప్పు పని చెయ్యలేదు. అది నీ దయార్ద్ర హృదయాన్ని చాటుతుంది. ఊరికే బాధపడకు. యింకో సిగరెట్టు కాల్చుకో. లారానికుకించి నీ కిష్టమొచ్చినన్ని సంగతులు చెప్పు"

కాని హాగ్ నిలవలేకపోయాడు. విచారవదనంతో యింటికి నడిచి వెళ్ళిపోయాడు. డ్రైవర్ పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకున్నాడు.

*   *   *

పొద్దున్న కాఫీ తీసుకుంటుండగా నౌకరొచ్చి, విజిటింగ్ కార్డొకటి చేతికందించాడు. "బారన్ హాస్‌బర్గ్ తరఫున గస్టేల్ నాడిన్" అని ఉంది దానిమీద. "క్షమాపణ పత్రం కోరడానికి కాబోలు రా దేముడా?" అనుకున్నాడు హాగ్. నౌకరుతో వారిని లోపల ప్రవేశపెట్టమన్నాడు.

బంగారు కళ్ళజోడు పెట్టుకున్న పండిన జుట్టుగల వృద్ధుడొకడు లోపలికివచ్చాడు. కొద్ది గ్రెంచియాసతో "ఎర్స్కిన్ అంటే మీరేనా" అన్నాడు.

హాగ్ తల ఆడించాడు ఔనని.

"బారన్ హాస్ బర్గ్ పంపించారు. ఆయన—"అంటూ ఏదో చెప్పబోయాడు.

"నాతరఫున నామనఃపూర్వకమైన క్షమాపణలను ఆయనకు అందించమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను" అన్నాడు హాగ్ తడబడుతూ

"బారన్ మీకీ ఉత్తరం యిమ్మన్నారు. అంటూ చిరునవ్వుతో, సీలుచేసిన కవరు ఒకటి అందించాడు

పైన, "హాగ్ ఎర్స్కిన్‌కి లారామెర్టన్‌కీ పెండ్లి కానుక" ఇట్లు ముసలి బికారి అని రాసి ఉంది లోపల పదివేలపౌన్లకు చెక్కు ఉంది

*   *   *

హాగ్ పెళ్ళికి అలన్ ట్రెవర్ పెద్దరికం వహించాడు. బారన్ చిన్న ఉపన్యాసం ఒకటిచ్చాడు పెండ్లి విందులో

"లక్షాధికారు నమూనాలుగా దొరకడమే అరుదు; నమూనాలు లక్షాధికారు కావడం మరీ అరుదు" అన్నాడు ట్రెవర్ ★

# ప్రతిజ్ఞ

పక్కి బాలకృష్ణారావు

పూర్వమొకప్పుడు సౌవీర దేశమును సునందుడనే రాజు పరిపాలించుచుండెను. అతని పాలనలో రాజ్యమందు మూడు కాయలారుపూవులు పూచునప్పటికీ అతనికి సంతానము లేనందున చింతాక్రాంతుడై ఉండేవాడు సంతతికై యజ్ఞములు, నోములు, తీర్థయాత్రలు కావించెను అప్పుడు ఒక సుదినమున సునందుని భార్యయగు సుశీల ఒక చక్కని సుగబిడ్డను కనెను. రాజు అపరిమితానందభరితుడై రాజ్యమంతా ఉత్సవములు జరిపించి, బీదసాదలకు దానములిచ్చి బ్రాహ్మణుల క్రగహారములు ప్రసాదించి, తనయునకు జయనందుడని నామకరణము చేసెను. జయనందుడు దినదినము శుక్లపక్ష చంద్రుని రీతి వర్థమానుడగుచుండెను. ఉచిత వయస్సురాగానే సకల విద్యలయందు ప్రావీణ్యము గడించెను. ఒకనాడు జయనందుడు వేటకు పోయి అలసి అలసి విశ్రాంతికై నొక చెట్టునీడను కూర్చొని, తనతో తెచ్చిన ఫలహారము సేవించి ప్రక్కనున్న నదిలో నీరు త్రాగుచుండ, నొక పొడవయిన, నన్నని, నొక్కుల కేశపాశము దొరికెను. జయనందుడా కేశమును చూచి ఆ వెంట్రుక సౌందర్యమునకు ముగ్ధుడై, చిత్రకారుడగుటచే ఆమె ఎవ్వతెయో ఆమె అందచందము లెటుండవలయునో ఊహించి, ఆ ఊహా సుందరినిగాంచి దిగ్భ్రమ చెందెను. జయనందుడా కేశమును చూచుచు తన చిత్రలేఖన మందిరమున నొక దివ్యసుందరి విగ్రహమును చిత్రించెను. తనచిత్రలేఖనమునకు తనేగర్వించి, పెండ్లాడినచో యిటువంటి త్రిలోకసౌందర్య రాశిని పెండ్లాడవలెనని, లేనిచో జీవితాంతము కఠిన బ్రహ్మచర్య వ్రతము సంకల్పింపవలెనని ప్రతిజ్ఞ పూనెను. ఇంతలో సునందుడు తన కుమారుడగు జయనందునకు వివాహవయస్సురాగానే తగిన వధువులను వెతకించుచుండెను ఎన్ని చిత్ర, విచిత్ర చిత్ర పటములను తెప్పించినను జయనందుడు పారద్రోలెను అప్పుడు సునందుడు ఆశ్చర్యపడి తనమంత్రి కిదేమనెను. అప్పుడు మంత్రి రహస్యముగ జయనందుని ప్రశ్నించి నిజము తెలుసుకొని, జయనందుడు చిత్రించిన రేఖా పటమును దేశ దేశములకు పంపించెను. అంత భటులు భూవలయమును తిరిగి కళింగదేశ రాజపుత్రిక ముమ్మూర్తులా చిత్ర పటమును రూపొందును అని తెలియపరచగనే జయనందుడు తన చిత్రలేఖనా కౌశల్యమునకు పరవశమొంది, కళింగ రాజపుత్రికను పరిణయమాడ ఉబ్బూతలూగెను. అప్పుడు రాజు కళింగకు వార్త నంపగ, తిరుగువార్తలో కళింగరాజపుత్రికయగు స్వయంప్రభ అడుగు ప్రశ్నకు సమాధానమిచ్చినచో పరిణయమాడవచ్చును, లేనిచో ఆమె ఉద్యానవనమాలిగ మూడేండ్లు పనిచేయవలెనని వచ్చెను

అయినను జయనందుడు సంసిద్ధుడయ్యెను. వెంటనే జయనందుడు ఒక సుముహూర్తమున గురువర్యుల ఆశీర్వాదమంది, ఉత్తమాశ్వారూఢుడై కళింగముజేరెను రాజాజ్ఞ పొంది స్వయంప్రభ మందిరమునకు వెళ్లెను. స్వయంప్రభ చెలికత్తె జయనందుని ఉచితాసనముపై కూర్చుండబెట్టి ఫలహారముల నిచ్చి స్వయంప్రభన కీవార్త తెలియజేసెను అప్పుడు రాకుమారి రాకనుగాంచి దివినుండి భువికి దిగి. వచ్చు అప్సరసను కాంచిన విధమున ఆశ్చర్యచకితుడయ్యెను. స్వయంప్రభయు జయనందుని చూడగనే రెండవ మన్మథునిగాంచినట్లయి, మరల నిజస్థితికి వచ్చి "ఎన్నొకసారి చూచితిని. మరల చూడగోరు చున్నాడ"ని ఒక డొక్క మైదానమున విలపించుచున్నాడు. అతనెవరు? ఎందులకతడు విలపించుచున్నాడు?" అని ప్రశ్నించెను. ఈ ప్రశ్నకు జయనందుడు

నిరాశజెంది తెల్లబోవగనే, స్వయంప్రభ మనస్సున దిగులొంది "రాకుమారా! ఎందులకింతనే దిగులొందెదవు? మనుజునకు సాధ్యము కానిదేది? ధైర్యముతో సాధింపుడని" పలుకగనే ఆమె మృదుమధుర వాక్యములకు ధైర్యము తెచ్చుకొని ఆనందమొంది బయలుదేరెను. అతడావిధముగ గుట్టలు, పర్వతములు, అరణ్యములు, చీకటడవులు, నదీనదములు బహుప్రయాసనొంది దాటుచు ఒకచోట విశ్రాంతి నొందెను. ఇంతలో దివ్య విహంగములజంట ఆ చెట్టున వ్రాలి, అందాడుపక్షి జయనందుని శ్రమకు జాలిచెంది 'నాథా! యెవ్వడితడు? ఎందులకింత శ్రమపడుచున్నాడు?" అని ప్రశ్నింప, పోతుపిట్ట "రమణీ!" యని జయనందుని వృత్తాంతము చెప్పగనే "ఆహా! మోహమెంతటిది!" అని ఆశ్చర్యమొంది "ప్రియతమా! ఇతడా మైదానమును పోయి కనగలడా? ఎవ్వడాతడు అటుల విలపించుచున్నాడు?" అని మగపక్షి అడిగెను. "చిత్రాంగీ! వింధ్య పర్వతములు దాటినపిమ్మట ఉత్తరముగ పోయిన అచట నొక పెద్ద ఎడారి గలదు. ఆ ఎడారిమధ్యమున నొకకొలనుగలదు. ఆ కొలను నీటిని తాకిన నొక సుందరాంగి ప్రత్యక్షమై, అతనిని వారి దివ్యలోకమునకు తీసుకపోవును. వారి లోకమున నందరును స్త్రీలే! అచ్చటి రాణి అతనిని అర్థసింహాసనముపై కూర్చుండపెట్టి, దాసీజనముచే నృత్యగానములొనరింపజేసి మధురాతి మధుర పాయసములిచ్చి గౌరవించును. ఆ దివ్యలోకరాజ్ఞి జగదేక సౌందర్య



వెలుగునీడలలో చిందిన అందం
—ఫొటో: బి. రవీంద్రనాథ్.

వతి. ఆమె సౌందర్యమునకు దేవతలు కాలిగోరుకు సరికారు. అటువంటి ఆమెను తాకక ఎవ్వరు మూడుదినములుందురో, వారినే ఆమె వరించును. లేనిచో వారికి ఆమె తగు శిక్ష విధించును. అచ్చటకు పోయిన ఆమెవలన సమాధానము పొందగలడు" అని జవాబిచ్చెను. జయనందుడు పక్షి భాష ఎరుగుట చేసి, వెంటనే వింధ్యప్రాంతముల కరిగెను. భరింపరాని పాట్లుపడి కొలను గనెను. తాకగనే, నొక సుందరవనిత జయనందు నొక మందిరమునకు తోడ్కొనిపోయెను అచటి రాణి అర్థసింహాసనముపై కూర్చుండబెట్టి గౌరవించెను. జయనందుడా రాణినిగాంచి ఆమె అందమునకు మురిసి, భ్రమించి

## బాలగేయం:

### 'అనంతం'

నిదురించు మాపాప
వదనమ్ము చూచు
కవిరాజులకు రమ్య
కల్పనలు తోచు.

కలలోన అమ్మపై
అలిగి యెటొ యేగు.
పెటపెటా ముఖముపై
పేలాలు వేగు.

కలలు కోకొల్లలుగ
కనును మాపాప,
కలలలో కతలు మొ
గమ్ముపై తోప.

నాన్న అమ్మను కసరి
నట్లు కలగనును,
వలజూచి పరువెత్తు
ఫులుగు మొగమగును.

అమ్మ 'పాలీయ' న
న్నట్లు కలగాంచు,
కారు మేఘాలు మొ
గాన నటియించు.

అమ్మ తను ముద్దాడి
నట్లు కలగనును,
చిఱునవ్వు వెన్నెలలు
విరియు మోమునను!



## ప్రతిజ్ఞ



శాకబోయెను గాని పక్షి మాటలు గుర్తుకురాగా అతికష్టముగ మూడు దినములు గడిపెను. అప్పుడామె జయనందుని వరించి యిష్టభోగ భాగ్యముల ముంచెత్తెను. ఆ సుందరి సత్కారములకు పరమానంద భరితుడై కొన్నాళ్లుగడిపి, తానువచ్చిన పనినిగూర్చి చెప్పెను. అప్పుడామె "ఓయీ! నన్నెవ్వరు మూడురోజుల లోపు తాకుదురో వారికి నా ఇచ్చ వచ్చు శిక్షను విధించుచున్నాను. కొందరిని శిల్పములుగను, కొందరిని కోతులుగను, కొందరిని కొలనియందలి చేపలుగను, కొందరిని పక్షులుగను మార్చివేయుచున్నాను. ఒకతను వచ్చిన మరుక్షణమే నన్ను తాకి ముద్దాడెను. వానినిమాత్రము దాసీచే తన్నించి ఒక మైదానమున పడవైచితిని. వానిని ముదుసలినిచేసి నడువకుండ చేసితిని. వాడిప్పటికిని "నినొక్క సారి చూచితిని. మరల చూడగోరుచున్నాడను అని విలపించుచున్నాడు" అని అతనితో బాటక్కడ నున్నవారి నందరిని చూపించెను. జయనందుడు వారినందరిని మరల నిజస్వరూప మీయమని ఆ దివ్య కాంతను కోరగా వారిపై ఆమె మంత్రపుసీరు జల్లి తొలి రూపములిప్పించెను. అప్పుడు జయనందుడా ముదుసలిని "ఓయీ! నీవెవ్వడవు?" అని ప్రశ్నింప "స్వామీ! తమ నామధేయంబు?" అని అడుగ జయనందుడు తన పేరు చెప్పెను. వెంటనే ఆ ముదుసలి జయనందునికి సాష్టాంగప్రణామ మొనరించి, ఆ పాదధూళిని నొసట బెట్టుకొని గంధర్వుడయి "రాకుమారా! ధన్యుడను. శాపవిముక్తి చేసితివి. అందుకోవోయీ" అని నొక రత్నహారము నొసంగి అదృశ్యమయ్యెను. జయనందుడా హారము ఆ సుందరికి బహూకరించిఆమెకడ సెలవొందికళింగము వచ్చెను. స్వయంప్రభకు జరిగినది చెప్పి పరిణయమాడెను ఇన్నినాళ్లు పుత్రుడు రానందున సుశీలా సునందులు పుత్రుడు గతించినాడని వగచి, వగచి గుండె రాయిచేసుకొనిరి. స్వయంప్రభను పరిణయమాడి జయనందుడు సావిరరాజ్యము చేరగనే ప్రజలు జయనందుని గుర్తించి హర్షధ్వానము చేసి తనయుని, సౌందర్యరాశియగు కోడలిని గాంచి సుశీలా సునందులు మిక్కిలి సంతసించిరి. వెంటనే మంచి ముహూర్తము చూసి జయనందుని పట్టాభిషిక్తునిజేసి రాజ్యభారము విదిల్చుకొని హాయిగ నుండెను. జయనందుడు తన ప్రతిజ్ఞ నెరవేరినందున అమితానందమంది ప్రజానురంజకముగ రాజ్యపాలన మొనరించుచుండెను. ★

# తెలివిలేని తిప్పయ్య

'గౌతమశ్రీ'

పున్నమినాటి వెన్నెలలో ఆరుబయట మంచాలు వేసుకొని పడుకున్నాము. వాసూ, వేణూ, మాత్రం మా తాతయ్య చెపుతూన్న కథలన్నీ అతిశ్రద్ధగా వింటున్నారు చంద్రుడికేసిచూస్తూ. వారి దృష్టిలో ఎందరో రాజకుమారులూ, రాజకుమార్తెలూ, రాక్షసులూ దొర్లిపోతున్నారు. వారి కుతూహలం తాతయ్య ఉత్సాహాన్ని ఇనుమడింపచేసేది. అలాగ తాతయ్య కథలువింటూ తొమ్మిదో, పదో అయినాక నిద్రపోవడం మాకందరికీ మామూలు. మా అందరి మనస్తత్వాల్ని అర్థం చేసుకున్న తాతయ్య ఎంతో మంచి కథల్ని చెప్పేవాడు. ఆ వేళ కూడా ఆప్రకారంగానే చెపుతున్నాడు.

ఇంతట్లో మా మంచం ప్రక్కనున్న కొబ్బరిచెట్టుక్రింద ఏదో చిన్నచప్పుడైంది. వాసు, వేణు, ఒకసారి అటుచూసి మళ్ళీ కథ వినడంలో నిమగ్నులైనారు. ఇంతలో మళ్ళీ చప్పుడైంది. బహుశా ఏఎలకో అక్కడ అల్లరిచేస్తూండి ఉంటుంది. ఈసారి వాసూ వేణూ నిజంగా భయపడి అవేపుచూసి "బాబోయ్! అక్కడేదో దెయ్యం ఉన్నట్లుంది తాతయ్యోయ్!" అన్నారు కంగారుగా. తాతయ్య గట్టిగానవ్వేశు. మీభయం బంగారుకానూ! అదేమిట్రా అలా భయపడతారూ అక్కడ ఏఎలకో చప్పుడుచేస్తోంది. దెయ్యం లేదు; దెయ్యంలేదు. మీ భయంచూస్తే వెనకటి తిప్పయ్యసెట్టి జ్ఞాపకమొస్తున్నాడు." వేణుకి ధైర్యం కలిగినట్లుంది. "తిప్పయ్యసెట్టి ఎవడు తాతా!" అన్నాడు. మేమందరం తిప్పయ్యసెట్టి కథ చెప్పమని బలవంతపెట్టేం తాతయ్యని. తాతయ్య నవ్వుతూ కథాప్రారంభం చేశాడు:

'"నేను మీ వయస్సులో ఉన్నప్పుడు ఈవూళ్లో ఒక చిన్నవ్యాపారస్థుడుండేవాడు. స్వతహాగా చాలా' మంచివాడు. కొంత అమాయకుడు అవడంవలన వూళ్లో అందరూ అతన్ని ఆదరంగా చూసేవారు. తిప్పయ్యశెట్టికి తెలివితేటలు లేకపోవడమే కాదు. అమితమైన భయంకూడావుండేది అతని భార్య మాత్రం మంచి తెలివైనది. ఏదో వ్యాపారంలో నాలుగురాళ్లు సంపాదిస్తూ జీవితాన్ని వెళ్లబుచ్చే వారా దంపతులు. భార్య, తిప్పయ్య భయాన్ని పోగొట్టేందుకని ఎంత యత్నం చేసినా లాభం లేకపోయేది. దానికి సాయం అతను అట్టే తెలివి కలవాడు కాకపోవడం వలన ప్రతి చిన్నవిషయానికి భయపడేవాడు. రోడ్డు మీద వెడుతూంటే మనమెవల్లమైనా అతనికేసి చూసే మనుకోండి. అతను హడలిపోయి ఇంట్లో దూరేవాడు. దాన్ని చూసి పెద్దలు ముసిముసి నవ్వులు నవ్వుతూంటే పిన్నలు ఇంకా వాడిని ఏడిపించేవారు.

ఒకనాడేమైందనుకున్నారేమిటి. మన వూరికి ఒక చిన్న నాటకాల కంపెనీ వచ్చి ప్రహ్లాద నాటకం ఆడుతున్నారు మేమందరం నాటకం చూడ్డానికి వెళ్ళాము. తిప్పయ్య మాత్రం మాతో రాలేదు. అతను రాకపోవడానికి కారణం ఏమిటో తెలుసా. నాటకంలోని నృసింహామూర్తి కాని - హిరణ్యకశిపుడు కాని తన్నేమైనా చేస్తారేమోనని! సరే ఇంటి దగ్గర హాయిగా పడుకున్నాడు. ఊళ్లో ఎవరూ లేకపోవడం చూసి ఓ దొంగాడు వీళ్లింటో దొడ్డిదారిని ప్రవేశించాడు భార్యాభర్తలు నిద్రించడం చూసి వాడు ఇంట్లో వస్తువులనన్నిటినీ సంగ్రహించి బయటికి పోవడానికి సిద్ధంగా ఉన్నాడు. ఇంతట్లో ఏ తలుపో తగిలి భార్యాభర్తలకి మెలకువ వచ్చింది వెంటనే జరిగిందంతాచూసి తిప్పయ్య భార్య లేచి ఆ దొంగాడి చెయ్యి గట్టిగా పట్టుకుంది పారిపోకుండా! భార్య ధైర్యానికి లోలోపల సంతోషించినా, తిప్పయ్యమాత్రం గజగజ వణికిపోతూ, దుప్పటీ ముసుగేసుకున్నాడు భార్య "దొంగ! దొంగ!" అని కేకలేసింది.

దొంగ తనభార్యనేమైనా చేస్తాడేమోనని భయంవేసింది తిప్పయ్యకి.

# తిమ్మరుసు

ఒకప్పుడో రాజ్యాన్ని ఓ రాజు పరిపాలించేవాడు. ఆ రాజు దగ్గర అతి తెలివయిన మంత్రి ఉండేవాడు. అతడు మిక్కిలి సామర్థ్యం కలవాడు. రాజుకు కుడి భుజమయినవాడున్నూ, అటువంటి మంత్రి హఠాత్తుగ మరణించటం చేత ఆ రాజు నిలువునా కూలిపోయాడు. రాజ వైద్యులను రప్పించి ఎందుకు బ్రతికించ లేదని హూంకరించాడు. వైద్యులు వణికి పోయారు. ఏం జవాబు చెప్పగలరు? ఎదురు జవాబు చెప్పటానికి ఎవరు సాహించగలరు? మంత్రిపైగల అభిమానమే ఆయన కోప కారణమని ఊహించి వైద్య శిఖామణి "ప్రభూ! మేమేమి చేయగలం! అంతా భగవద్విలాసం" అన్నాడు. రాజుకు మండుకొచ్చింది.

"మీ చేతకానితనానికా భగవద్విలాసం! పొండి! నా ఆ స్థానంలో ఒక్క క్షణం ఉంటానికి వీల్లేదు. మహా మంత్రిని రక్షించని మీ వైద్యులను శిక్షించినా తప్పులేదు. హుం...పొండి" అని కసిరాడు. తలలు వంచుకు వైద్యులు వెనుదిరిగి పోయారు. రాజు దుఃఖముతో క్రుంగి పోయాడు. ఆహార పానీయాలు విసర్జించాడు. ఈ సంగతి తెలసి రాణీ వచ్చి రాజు నోదార్చి హితోపదేశం చేసింది. "మహారాజుల ధైర్యం పడకండి! యధా రాజా, తధా ప్రజా! మీ రే యిలా గయితే యిక ప్రజలగతేం కాను? రాజస్థానంలో మరొకర్ని మంత్రులుగా నియమించి మామూలుగ రాజరికాన్ని నిర్వర్తించండి! అధైర్యపడకండి" అని సెలవిచ్చింది. రాజుకు జ్ఞానసిద్ధించింది. తన అవివేకానికి (వైద్యుల కడ) సిగ్గుపడి, మరల ఆ స్థాన వైద్యులను రప్పించాడు తిరిగి చనిపోయిన మంత్రితో సమానులెలా దొరకగలరు? అందుకో పరీక్ష పెట్టాడు. చిత్రపటాలుపై ఒక్కొక్క నిలువుగీత గీసి ఎవరయితే దీన్ని చెఱపకుండ పొట్టిగ చేస్తారో, వారికి మంత్రిపదవి యివ్వబడును అని రాయించి వివిధ దేశాలు పంపించాడు. తన రాజ్యంలో రోజూ చాటించేవాడు. కొందరీ సంగతి విని నవ్వుకున్నారు. "హాహాహ చెఱపకుండ పొట్టిచెయ్యాలిట. మా బావుంది. రాజుకు నిజంగా పిచ్చెక్కింది మంత్రి పోవటంతో" అని కొందరు వేళాకోళం చేయసాగారు. "అయ్యో! రాజు కెంత దురవస్థ పట్టింది! ఇచ్చినగీత చెరపకుండా పొట్టిచేయాలట! నిజంగానే రాజు ఉన్మాది అయ్యాడు. పాపం ఎంతగా మహారాణి విచారిస్తోందో!" అని కొందరు విచారించారు. కాని ఒక్కడూ ముందుకొచ్చి కార్యసాధన చేయలేకపోయారు. ఒకసారి రాజాస్థానంలో చాటింపు ఒక వీధిబడి గుండా పోతోంది. బడిపంతులు ఏమిటదని చాటింపుగాళ్లను అడిగాడు. వాళ్లు చిత్రపటాన్ని చూపించి అంతా చెప్పారు. ఈ చిత్రాన్ని చూడటానికి బడిపిల్లలంతా వచ్చి తిలకించారు. మామూలుగ అందరిమాదిరిగానే

'బాలకృష్ణ'

## ★ తెలివిలేని తిప్పయ్య ★

ఒకవేళ తనభార్యచేతిని కరిచేసి పారిపోతే! తన భార్యని హెచ్చరించడం మంచిదనుకున్నాడు. ఎల్లాగో లేచి ధైర్యం తెచ్చుకుని "ఏమేవ్! ఆ దొంగాడు మంచివాడు కాదు. నీచెయ్యి కరిచేసి పారిపోకలడు జాగ్రత్త! అని అరిచేడు. అప్పటి వరకూ ఎల్లా పారిపోవడమా అని ఆలోచిస్తున్న దొంగకి మంచి ఉపాయం తట్టింది. వెంటనే తన చెయ్యి పట్టుకున్న తిప్పయ్య భార్య చేతిని గట్టిగాకరిచేసి పారిపోయాడు వస్తువులతోసహా!...

మర్నాడీకథంతా ఊరందరికీ తెలిసింది. తిప్పయ్య ధైర్యానికీ, తెలివికీ అందరూ పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వుకున్నారు". ఇదీ తిప్పయ్యకథ అన్నాడు తాతయ్య. ★

## ★ తిమ్మరుసు ★

బడిపంతులు "అయ్యో! రాజు నిజంగా పిచ్చివాడయ్యాడు. దానికిదే తార్కాణం" అని నిట్టూర్పు విడిచారు. అప్పుడో పది పన్నెండేళ్ల బాలుడు నిలుచుని "గురూజీ! రాజు పిచ్చివాడు కాడు. నేను చెరపకుండ పొట్టి చేయగలను" అన్నాడు. "కూర్చో! కూర్చో! గడుగ్గాయి వెధవా!" అని ఖండించాడు ఆ బాలుడు నిశ్చలంగా నిల్చుని "పొరపడుతున్నారు. ముమ్మాటికి అది చేయగలను" అన్నాడు. "ఎలాగని?" అడిగాడుపాధ్యాయుడు. ఆ బాలవిద్యార్థి పలక తీసి ఒక గీత గీసాడు. ఇదే రాజుగారి గీతనుకోండి. "ఊ" బాలుడు దాని ప్రక్క మరో పొడుగుపాటి నిలువు గీత గీసి "ఇప్పుడిది పొట్టిదయ్యిందికదండీ" అన్నాడు. పంతులు ఆశ్చర్యపోయాడు కాబోయే మహామంత్రి కాబోతున్నాడు ఆ బాలకుడు. తనే ఆలోచించాడని రాజును సందర్శిస్తే



తనేగా మహామంత్రయ్యేది! ఈ ఆలోచన తట్టటంతో "ఓయీ! ఈ సంగతి ఎవ్వరకూ చెప్పకు. నేను రాజును దర్శించి మంత్రిపదవిని స్వీకరిస్తాను అబ్బాయిలూ! ఈ సంగతి మీ యింట్లో పొక్కారో జాగ్రత్త" అని బెత్తం ఝళిపించాడు బడి వదిలిన వెంటనే ఉపాధ్యాయుడు రాజును దర్శించి "నేను పొట్టిగ చేయగలను" అన్నాడు. రాజు ఆనందభరితుడయ్యాడు గాని ఉపాధ్యాయుని విగ్రహం చూడటంతోనే యితనా కాబోయే మంత్రి అనిపించింది. ఉపాధ్యాయుడు పొట్టి చేశాడు. రాజు ప్రత్యక్షంగా మరో పరీక్ష పెట్టదలిచాడు ఒక గదిలో మధ్యను ఒక బల్లపై రాజముద్ర నుంచి చుట్టూ నేలమీద రత్న ఖచితమైన కంబళీలు పరిచాడు. "మహామంత్రీ! రత్నఖచితమైన కంబళీలు త్రొక్కకుండ ఆ రాజముద్రను స్వీకరించండి" అన్నాడు రాజు ఉపాధ్యాయుడు ప్రశ్నను తాళుకోలేకపోయాడు. గజగజ వణికిపోయాడు ముచ్చెమటలు పోశినై రాజుతో చెలగాటం ప్రాణంతో పోరాటం. ఇంకేం దారి? ఉపాధ్యాయుడు రాజు పాదాలపై పడి "మహాప్రభూ! క్షమించండి. నిజం చెప్పేస్తాను ఈ ఆలోచనలు నావి కావు నా శిష్యబృందంలో నొక బాలునిది" అని మొరపెట్టుకున్నాడు. రాజు భటులద్వారా బాలకునిరప్పించాడు. రాజు బాలుని చూచాడు ఆ బాలకుని ముఖారవిందంలో ఒక దివ్య తేజస్సును చూచాడు. జరిగిందంతా బాలుడు వివరించాడు. తప్పక ఈ

(54-వ పేజీ చూడండి)

బాలసాహితి సీరియల్

# సాగర గర్భంలో సాహస యాత్ర



మూలం: జూల్స్ వెర్న్

## జరిగిన కథ :—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది సముద్రంలో ప్రయాణంచేసే నౌకల కది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికి, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడాని- నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కౌన్సిల్ తో సహా ఓడ ఎక్కుతాడు అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ ఆమహాసముద్రంలో ప్రవేశిస్తుంది అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగుకనిపించింది ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది ప్రొఫెసర్ అరోనా, కౌన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తాడు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. భోంచేసి అందరూ హాయిగా నిద్రపోతారు తిరిగీ తను కన్నపానాలు రాలేదని అంతా మథనపడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలోనించి ఎవరు బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు ప్రొఫెసర్ అరోనా నీమో గదిలో వింతలు విశేషాలు చూచి ఎంతో ఆశ్చర్యపోతాడు కెప్టెన్ నీమో జలాంతర్గామి నడిపించేపద్ధతి అంతా ప్రొఫెసర్ అరోనాకు తెలియజేస్తాడు. పిమ్మట జలాంతర్గామి కిరువైపులా తెరచుకున్న అద్దాలలోనించి అద్భుతమైన సాగరగర్భ జలచరాలు కనిపిస్తాయి. ఆ తరవాత జలాంతర్గామి సాగరగర్భంలోని క్రెస్పో ద్వీపానికి బయలుదేరుతుంది.

## 17. సముద్రం అట్టడుగున కీకారణ్యం

అలా అలా కొంతసేపు నడిచి మేమందరము సముద్రం అట్టడుగున ఉన్న కీకారణ్యంలో ప్రవేశించాము. అది కెప్టెన్ నీమో సాగరగర్భ సామ్రాజ్యంలోని మహారణ్యం. ఆ మహా సాగరగర్భంలో

అనువాదం: "వినాయక"

అతని అధికారం కాదనే వారెంకెవరున్నారు?

ఆ కీకారణ్యంలో చెట్లన్నీ అచ్చంగా మనందరికీ భూమిమీద కనిపించే చెట్లలాగే ఉన్నాయి. నేనా చెట్ల ఆకులు ఇంతకుపూర్వం అంత శ్రద్ధగా పరిశీలించ లేదు. కొంచెం దగ్గిరగా వెళ్ళి అవన్నీ జాగ్రత్తగా పరిశీలించేసరికి నాకెంతో ఆశ్చర్యం వేసింది.

ఆ చెట్ల కొమ్మలు, ఆకులు అడ్డంగా ఉన్నట్లు కనబడలేదు. అవన్నీ ఆకాశం వైపే తిరిగి ఉన్నాయి.

క్రమక్రమంగా నేనీవిధమైన చిత్రవిచిత్రాల కన్నిటికీ అలవాటు పడిపోయాను. అక్కడి వస్తువులెంత బాగా కనిపిస్తున్నా వాటికి భూమి మీద ఉన్నంతటి విస్పష్టత లేదు. కాని క్రమంగా మేము దానికికూడా అలవాటుపడ్డాము.

అయితే కాళ్ళకు తగులుతున్న చిన్న చిన్న రాళ్ళు అవ్వీ మాకు కొంచెం ఇబ్బంది కలిగిస్తూనే ఉన్నాయి.

ఇక్కడ కనిపించిన చెట్లు, చేమలు, ఆర్కిటిక్ ప్రాంతాలలో కనిపించే చెట్లల్లాగే ఉన్నాయి.

అయితే ఇంకొక్క చిత్రం మాత్రం ఉంది. ఈ చెట్లకీ, చేమలకీ ఎక్కడా వేళ్లులేవు. అవి ఇసక నేలనో, రాళ్లనో అంటిపెట్టుకున్నట్టున్నాయి. ఆ మొక్కలు పెరగడానికి అవసరమైన పదార్థాలన్నీ సముద్రపు నీటిలోనించే సప్లయి అవుతున్నాయి. వాటి ఆకులన్నీ రకరకాల రంగుల్లో తళతళా మెరిసి పోతున్నాయి.

ఆ అడవిలో కొంచెం పెద్ద పెద్ద చెట్లవంటివీ, చిన్నచిన్న పొదల వంటివీ, నాచులాంటివీ-ఎన్నెన్నో రకాలున్నాయి.

వాటి మధ్యన, గుబురుల మధ్యన చిన్నచిన్న జలచరాలు కూడా కనిపించాయి గాని మొత్తం మీద అవ్వన్నీ ఒకే మాదిరిగా ఉన్నాయి. వాటి మధ్యన ఈగల్లాంటి చిన్నిచిన్ని చేపలటూ ఇటూ కదలాడుతున్నాయి.

అలాగ కొంతసేపయ్యే సరికి ఒంటిగంట అయింది. కెప్టెన్ నీమో మా అందరినీ ఇకముందుకు పోవద్దని ఒకఫర్మానా జారీ చేశాడు. నేనాఫర్మానాకేమీ దిగులుపడలేదు. నేనప్పటికే కొంచెం అలిసిపోయాను. అందరం కొంచెంసేపు ఒకచోట విశ్రాంతి తీసుకున్నాము.

ఆకాస్సేపు నా ప్రాణానికెంతో హాయిగా ఉంది. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూచుంటే బాగుండునని అనిపించింది. కాని అది బొత్తిగా వీలులేనిపని. నా తలమీద ఒక పెద్ద రాగిబురఖా తగిలించారు. ఆ పరిస్థితులలో కౌన్సెలు తలకు దగ్గరగా నాతల పెట్టడంకన్న నేనిక వేరే చెయ్యగలిగిందేమీ కనిపించలేదు.

కౌన్సెలు చాలా కులాసాగా ఉన్నాడు. చిన్నచిన్న కన్నాలలో నించి కనిపించే అతని చిట్టి కళ్లు చూడగానే నాకు కలిగిన అభిప్రాయమది!

అతడొక పెద్ద చేపలాగ అటూ ఇటూకదులుతూంటేచూస్తే ఎలాంటివారికైనా నవ్వు వచ్చితీరుతుంది!

నేనించుమించుగా నాలుగు గంటలసేపు నడిచాను. అప్పటికి నాకు బాగా ఆకలి వెయ్యవలసిందే. కాని ఎందుచేతనో నా కాకలి వెయ్యలేదు. దానికి బదులు నిద్ర తయారయింది. సామాన్యంగా సముద్రం అట్టడుగున సంచరించే వారికి కొంతసేపటికి నిద్రరావడం సహజమే.

నాకళ్లు మెల్లిమెల్లిగా మూసుకుపోయాయి. మా కెదురుగా కెప్టెన్ నీమో, అతని సహచరుడు అప్పుడే నిద్రమత్తులో మునిగిపోయారు.

అలాగ నేనెంతసేపు నిద్రపోయానో చెప్పలేనుగాని లేచి నాలుగువైపులా పరకాయించి చూసేసరికిఅప్పుడే పడమటిదిక్కుకు సూర్యుడు బాగా వాలిపోయాడు.

అప్పుడే కెప్టెన్ నీమో లేచి పచారు సాగిస్తున్నాడు. నేనింకా బద్ధకంగా అలాగే మేనువాల్చాను గాని ఎదురుగా ఏదో కనిపించి హఠాత్తుగా లేచి నిలుచున్నాను! నాకు నాలుగైదడుగుల దూరంలో ఒక బ్రహ్మాండమైన సముద్రపు సాలెపురుగు ప్రత్యక్షమైంది. అది నాపైన ఇంకా ఒకగజం ఎత్తున నిలబడి హఠాత్తుగా నామీదికి ఉరకడానికి సిద్ధంగాఉంది. సూదుల్లాంటి చూపులతో నాకేసి చూస్తూంది. అది నామీది కురికి నన్ను గాయపరచడానికి ప్రయత్నించినా నాకు వచ్చే ఆపత్తేమీ లేదు. నేను వేసుకొన్న కవచం అంతగట్టిది. అయినా దానిని చూడగానే నా పంచప్రాణాలు పైనే ఎగిరిపోయాయి.

సరిగా అదే సమయంలో కౌన్సెలు, కెప్టెన్ నౌఖరు అప్పుడే మేలుకొన్నారు. కెప్టెన్ నీమో నౌఖరుకేసి చూసి వేలితో ఆభయంకర జలచరం ఉన్న ప్రదేశం చూపించాడు. అంతలోనే తుపాకీ పేలింది. ఆ జంతువు విలవిలా తన్నుకుంటూ చచ్చిపోయింది.

నాకది చూడగానే అంతకన్నా భయంకరమైన జలచరాలా ప్రాంతంలో తిరుగుతూ ఉండవచ్చు

నని అనిపించింది. నేను వేసుకున్న కవచం వాటి ముందెందుకు పనికి రాదని కూడా తేలిపోయింది. అంతకుపూర్వం నేనావిషయాన్ని గురించి అంతగా ఆలోచించలేదు గాని ఆక్షణం నించీ కొంచెం జాగ్రత్తపడ్డాను.

మా ప్రయాణం అంతటితోనే ఆగిపోయిందనీ, అంతకన్నా ముందుకు వెళ్లవలసిన అవసర మేమీ లేదనీ అనుకున్నాను గాని నా ఊహ తప్పింది

కెప్టెన్ నీమో ఇంకా ముమ్ముందుకు సాగిపోయాడు మా క్రింది భూభాగం ఇంకా కిందికి దించుకు పోయింది. క్రమంగా మేమంతా రెండు పెద్దఎత్తైన ప్రదేశాల మధ్య భాగానికి చేరుకొన్నాము. అప్పటికి మేము 75 నిలువుల లోతు దాకా వెళ్లిపోయాము. అయినా మాకే విధమైన ఇబ్బందీ కలగ లేదు. సామాన్యంగా మానవు లెవరు 45 నిలువుల కంటె ఎక్కువ లోతు నీటిలోకి పోలేరు, కాని మా కవచాల శక్తివల్ల ఆ అవధికూడా తేలికగా దాటిపోయాము.

క్రమక్రమంగా మా చుట్టూరా అంతా గాఢాంధకారంగా మారిపోయింది. అంతలోనే హఠాత్తుగా ఒక మెరుపు మెరిసినట్లయింది.

కెప్టెన్ నిమో తన విద్యుద్దీపిక వెలిగించాడు. వెంటనే అతనినొఖరు మేము కూడా మా విద్యుద్దీపికలు వెలిగించాము.

ఆ దీపాల కాంతిలో మాచుట్టూరా 45 గజాల మేరవరకు అంతా స్పష్టంగా కనిపించింది

తరవాత క్రమక్రమంగా నాలుగు గంటలయ్యేసరికి మా ప్రయాణం ముగిసింది మళ్లీ మేము తిరుగుముఖం పట్టాము. దోవలో మాకు రకరకాల చేపలెన్నెన్నో కనిపించాయి.

అంతలోనే కెప్టెన్ మళ్ళీ తుపాకీ గురిపెట్టాడు. మా కెదురుగా ఒక విచిత్రమైన జలచరం ప్రత్యక్షమైంది. దానిపొడవు అయిదడుగులు. చర్మం చాలా సొగసుగా ఉంది. పైపైకి చర్మం గోధుమవన్నెతో మెరిసింది గాని చర్మం అడుగు భాగంలో తెల్ల తెల్లని చుక్కలు తళ తళా మెరిశాయి. దాని చర్మం చాలా విలవైనది. రష్యాలోను, చైనాలోను ఆ చర్మంకోసం ఎంత డబ్బైనా గుమ్మరిస్తారు. అధమపక్షం ఆ చర్మం ఎనభై పౌనులైనా విలవచేస్తుంది. ఆ జంతువా ప్రాంతంలో ఎక్కడోగాని దొరకదు. సామాన్యంగా అది ఉత్తర పసిఫిక్ సముద్ర ప్రాంతంలోనే కనిపిస్తూంటుంది.

అంతలో మళ్ళీ ఇంకొకమారు తుపాకీ కాల్చిన చప్పుడైంది. ఈసారి ఆ తుపాకీ దెబ్బకు సముద్రంమీద సంచరించే పెద్ద పక్షి ఒకటి తరంగాల్లో పడిపోయింది. దాని పేరు ఆల్ బేట్రస్.

అయితే మా నడక అలాగే నిర్విఘ్నంగా సాగిపోయింది. తరవాత కొంతదూరంలో మా జలాంతర్గామి దీపంమినుకు మినుకుమని మెరిసింది.

అంతలోనే కెప్టెన్ నీమో హఠాత్తుగా నన్ను వెనకకు తోసివేశాడు. తరవాత తానుకూడా వెల్లకిలా పడుకున్నాడు. ఆ ధోరణి చూచి నేనెంతో ఆశ్చర్యపోయాను.

నా రక్తనాళాలలో రక్తం అంతా గడ్డకట్టుకు పోయింది. మా కనతిదూరంలో అతిభయంకరమైన మరి ఒకజలచరం కనిపించింది!

అది ఒక బ్రహ్మాండమైన జలచరం. దాని వెనకాలే అలాంటిదే మరి ఒక జలచరం తయారయింది. అవి రెండూ మామీదికి ఉరకడానికి సిద్ధంగా ఉన్నాయి. వాటి కోరలలో ఎలాంటి మనిషి అయినా పిండి పిండి అయిపోవలిసిందే !

కౌన్సెల్ ఆ జలచరం వర్గీకరణ కోసం నా వెనకాలనించి నిశ్చలంగా పరిశీలిస్తున్నాడో లేదో తెలియదు గాని నేనా జంతువుల కోరలకేసీ తెల్లని పొట్టలకేసీ చూశాను. అంతలోనే అవి నామీదకురుకుతాయేమోనని భయంవేసింది.

అయితే ఆ జంతువులకు కళ్లు బాగా కనిపించవు. అందుచేత చూపువాసిలో మేమొక పెద్ద ఆపత్తులోనించి తప్పించుకున్నాము. నిజంగా ఒక అడివిలో ఒక పెద్దపులి వాతపడి తప్పించుకొని బైటపడినంత పని జరిగింది!

తరవాత ఒక అరగంట సేపు నడిచి మళ్లీ మేము జలాంతర్గామి దగ్గిరికి చేరుకొన్నాము. మేమంతా లోపలికి వెళ్లగానే కెప్టెన్ జలాంతర్గామి తలుపు మూసివేశాడు. మేము లోపలికి వెళ్లిన వెంటనే కెప్టెన్ నీమో ఒక మీట నొక్కాడు. లోపలి నీరంతా సముద్రంలోకి పోగానే మేము మెల్లిగా మెట్లెక్కి జలాంతర్గామి లోలోపలికి వెళ్లిపోయాము.

తరవాత మా కవచాలన్నీ విప్పివేశారు. నేను ఆ అత్యద్భుత సముద్ర దృశ్యాలన్నీ తలుచుకుంటూ అలాగే ఆశ్చర్యపోయాను.

—ఇంకా ఉంది.

# తిమ్మరుసు

(50-వ పేజీ తరువాయి)

బాలుడు రాజముద్రను స్వీకరించగలడనుకున్నాడు. రాజముద్రను కంబళీలు త్రొక్కక స్వీకరించమన్నాడు. ఒక క్షణం శూన్యంలోనికి దృష్టి ప్రసరించి బాలుడు గదిని చేరి ఒక్కొక్క కంబళి చుట్టచుట్టి రాజముద్రను పట్టుకుని, తిరిగి వచ్చునపుడు ఒక్కొక్క చుట్ట విప్పి వచ్చాడు. ఆస్థానపండిత పామరులు ఆశ్చర్యమొందారు. రాజు మేరువు పర్వతం లభించినంత ఆనందం పొందాడు. "ఇటువంటి శిష్యులను తయారుచేయండ"ని రాజు ఉపాధ్యాయునికో అగ్రహారం బహుమతిగా యిచ్చాడు. ఆ బాలుడే మంత్రిపదవి స్వీకరించాడు. ఆ బాలుడెవరో తెలుసా? మహాంధ్ర సామ్రాజ్య రథసారధి తిమ్మరుసు. ఆ రాజు గర్వము నుడయించినవాడే మన శ్రీకృష్ణదేవరాయలు.



# గీర్వాణ భాషాభ్యాసం

(11-వ పేజీ తరువాయి)

విలువలేకపోయింది. ఒకమారు పుట్టింటివారిని సందర్శించవలెననే మిషతో తన కుమారుని వెంటబెట్టుకొని భరుకచ్ఛదేశ రాజధానికి ప్రయాణమై వెళ్ళిపోయింది.

మలయవతి పుట్టింటికి వెళ్ళిపోగానే ఆ నింద అంతా ఒక్కసారిగా శర్వవర్మ తలపై విరుచుకుపడింది. ప్రతిష్ఠానగర పౌరులందరు గుణాఢ్యుని అరణ్యవాసానికీ, మలయవతి నిర్గమనానికీ శర్వవర్మామాత్యుని కుతంత్రాలే కారణమని అతని ననేకవిధాలుగా దుయ్యబట్టారు. కొందరింకా లోతుగా ఆలోచించి వీటన్నింటికీ చక్రవర్తే కారణమన్నారు. ఆంధ్ర శాతవాహన సామ్రాజ్యంలో అధర్మం పెరిగిపోతున్నదనీ అలాంటి విడ్డూరాలెన్నడు కనీ వినీ ఎరగమనీ అన్నారు.

గుణాఢ్యుని ప్రతిష్ఠతో పాటు చక్రవర్తి శర్వవర్మామాత్యులపై పౌరులు చేసే నిందారోపణలు, ఈసడింపులు కూడా బాగా పెచ్చు పెరిగిపోయాయి. క్రమక్రమంగా అవన్నీ చక్రవర్తిదాకా వెళ్ళిపోయాయి.

ప్రతిష్ఠాన నగరంలో శర్వవర్మ ప్రతిష్ఠ అంతా క్రమక్రమంగా అప్రతిష్ఠ పాలైపోయింది.

శర్వవర్మ ఒకనాటి రాత్రి ఆవిషయంలో బాగా మథనపడి "పుట్టింటికి వెళ్ళి నా పట్టపురాణి, అడవులుపట్టిపోయి నా మహామాత్యుడు ఇంకా నాపైన పగసాధిస్తూనే ఉన్నారు!" అనుకొన్నాడు. ఆరాత్రి అంతా అతనికి తిన్నగా నిద్రపట్టనే లేదు. —సశేషం.

# ఆషాఢతగూ

(12 వ-పేజీ తరువాయి)

అరె! ఎప్పుడొచ్చారు? వచ్చినట్లు శ్రీమణి తనతో చెప్పనేనా లేదే! అయినా ఏ సంగతేనా తను చెప్పనిస్తేకదా! కోపంతో వచ్చి పడుకొన్నాడాయె. మాట్లాడటానికి వస్తే గైగై చెప్పాడు.

వంటింట్లోంచి మాటలు వినిపిస్తున్నాయి. తాను ఇంకా ఇంటికి రాలేదా అని మామగారు అడుగుతున్నారు. వచ్చి గదిలో పడుకున్నారు నాన్నా అంటూంది మణి. ఇక గోపాలం తప్పని సరిగా లేచి హాల్లోకి వస్తూన్నాడు. అప్పుడే మామగారు కూడా వంటింట్లోంచి వస్తున్నారు. ఇద్దరూ రేడియో దగ్గర రెండు కుర్చీల్లో కూర్చున్నారు.

"రేడియో ఎలాగుందోయ్?" అని మామగారే ప్రసంగం ఎత్తారు కుశల ప్రశ్నలు ముగిశాక.

రేడియో మాట ఎత్తేసరికి గోపాలానికి అభిమానం మళ్ళీ తలెత్తింది. "ముచ్చటగా ఉంది" అని ముక్తసరిగా జవాబిచ్చాడు.

"మీ కాలేజీలో కృష్ణమూర్తి అని ఒక లెక్చరరు ఉన్నాడట కాదూ, అతని అన్నగారి స్టోర్సులోనే ఇది తీసికొన్నది. నీతో కూడా పరిచయమేనని చెప్పాడు. చాలా మంచి పెద్దమనిషి, మర్యాదస్థుడూను."

"ఓహో అలాగా" అని ఊరుకున్నాడు గోపాలం. కూతురిగారి ప్లాను నెరవేరడానికి తండ్రిగారేవన్న మాట సాయం చేసింది.

"కొత్త అల్లుడికి పెండ్లయిన సంవత్సరము ఆషాఢతగూ అని ఇస్తారు ఒక ప్రెజంటు. నాకు ఇది తెస్తే బాగుంటుందని తోచి తీసుకొచ్చాను. నీ మనసుకు నచ్చితే నాకదే సంతోషం నాయనా" అంటూ అల్లుడి ముఖంలోకి ఉత్సుకతతో చూశారు మామగారు.

ఇంతలో, లోపల్నుంచి హాలుగుమ్మంలో నుంచుని నవ్వుతున్న శ్రీమణివైపు చూసి, మామగారున్న సంగతే మరిచిపోయి, గోపాలం నవ్వాపుకోలేక వెక్కిరించేశాడు. ముసలాయన తెల్లబోతూ కూతురు ముఖం అల్లుడి ముఖం చూసి, సంగతి తెలీకపోయి... వాళ్ళతో పాటు నవ్వేశాడు.



## "కాబట్టి నీ ఓటు నాకే"

ఎన్నికల ప్రచారం జరుగుతోంది. అభ్యర్థి పెద్ద ఉపన్యాస మిచ్చి, "మీ ఓటు నాకే" అంటూ ముగించాడు.

"నువ్వు దేముడివైనా సరే నా ఓటు నీకివ్వను" అన్నాడు శ్రోతలలో ఒక పెంకె ఘటం.

"నేను దేముడినే అయితే, నా నియోజకవర్గంలో అసలు నీకు చోటుండదు" అన్నాడు అభ్యర్థి.

# వనితాలోకం

## బిడ్డల భవితవ్యము

బిడ్డలలో ఒకబిడ్డ ఇంట్లో ఉన్న సామాను లన్నీ విరగగొట్టుతూ ఉంటాడు. ఒకబిడ్డ ఎప్పుడూ మానిసా రాతిమీద రాయిపెట్టో, సుత్తి పెట్టో టకటక కొట్టుతూ ఉంటాడు. ఒకడు ఎప్పుడు చూసినా బూరాలు ఊదుతూ ఉంటాడు. ఒకడు సుద్దముక్క గాని బొగ్గు గాని తీసుకొని నేలమీదా గోడల మీదా గీస్తూ ఉంటాడు. ఒకడు ఎత్తుగా కనబడిన వస్తువుమీద కూర్చుని 'చల్ చల్' అంటూ గుఱ్ఱపుస్వారీ చేస్తాడు. ఒకడు 'అమ్మా! కడుపునొప్పి వచ్చిందా? మందియ్యనా?' అంటూ తల్లినోట చిటికెడు ఉత్తుత్తి మందు వేస్తాడు. ఒక బిడ్డ పదిమంది తోడి బిడ్డలకు సలహాలిస్తూ ఉంటే, మరొక బిడ్డ తీర్పు చెప్పుతూ ఉంటాడు. ఈ రకపు బిడ్డల చిద్విలాసాలు కని విని ఆనందించని తల్లిదండ్రులు అరుదు. అందరికీ అనుభవైకవేద్యమే. ఇవన్నీ బిడ్డల చిలిపిచేష్టలుగా తల్లులూ తండ్రులూ భావిస్తారు, తాత్కాలికముగా ఆనందించి విస్మరింప తగినవను కొంటారు.

కాని బిడ్డల బాల్యక్రీడలు వారి భవితవ్యాన్ని సూచించేవి! భావి జీవితములో వారి అభిరుచులను ఆశయాలను తెలిపేవి, వారి శక్తి సామర్థ్యాలు ఏ మార్గములో రాణించగలవో ఆ మార్గాలను మనకు అవగతము చేయగలిగినవి. బిడ్డలతోపాటు ఇవి కూడా అభివృద్ధి చెంది వాటిని ఇనుమడింప చేసేవి. వీటిని తల్లిదండ్రులు గ్రహించి తగు విధాన దోహదము చేసినట్లయితే బిడ్డల సహజ శక్తులు వారి భావిజీవితాలకే కాకుండా దేశానికి కూడా ఉపకరించ గలవు.

**ఇల్లిందల సరస్వతీదేవి**

కాని బాల్యక్రీడలు కేవలము చిలిపి చేష్టల క్రింద పరిగణింప బడటము మన కెరుగని విషయముకాదు. దీనికి కొంతవరకూ అజ్ఞానమూ అశక్తతా కారణాలు. వైద్యవృత్తియందు అభిలాషగల బిడ్డను వైద్య శాస్త్రము చదివించగల తల్లిదండ్రు లెంతమంది మన దేశములో ఉన్నారు? ఇంజనీరింగు కళాశాలలో చదివించగల సామర్థ్యము ఎంతమంది తలిదండ్రుల వద్ద ఉన్నది? అదృష్టవశాత్తు చదువుకొన్న విద్యార్థులలో చాలామంది గుమాస్తాలుగాను బడిపంతుళ్లు గాను జీవించవలసి వస్తున్నది కదా! ఇది బిడ్డలకు తగిన అవకాశాలు లేనందువల్ల సంభవించినవి, కాని, బాల్యక్రీడలకు తగిన ప్రాముఖ్యము ఇవ్వని సందర్భాలు కూడా లేక పోలేదు. అవకాశము లభించినదే తడవుగా బిడ్డల అభిరుచులకు తల్లిదండ్రులు భిన్నముగా ప్రవర్తించిన నిదర్శనాలు అనేకము. కనుకనే మన దేశములో వ్యక్తులను వారి శక్తి సామర్థ్యాలూ ఆశయాలూ ఒక వైపుకూ, కర్తవ్యమూ బాధ్యతలూ మరొక వైపుకూ లాగుతూ ఉండటము సంభవిస్తున్నది. వైద్యవృత్తియందాసక్తి కలవాడు ఇంజనీయరుగాను, చిత్రకళయందాసక్తి కలవారు వైద్యులుగాను, సాహిత్యమూ కవిత్వములో అభిరుచీ ఆసక్తీ కలవారు విజ్ఞాన శాస్త్రజ్ఞులుగాను కాలము గడపవలసిన వారవుతున్నారు. చాలామందికి అభిరుచులకూ బాధ్యతలకూ మధ్యగల విభిన్నతచేత వారికి కలిగిన మనోవికాసము అసమగ్రమయి తేజోరహితమయి కొన్ని సందర్భాలలో బిడ్డల శక్తి సామర్థ్యాలు నిరుపయోగమవటానికి కారణ మవుతున్నది. దీనివల్ల ప్రజలలో నిరాశావాదము వృద్ధి పొందటానికి అవకాశ మేర్పడుతున్నది.

ప్రతి తల్లిదండ్రికీ బిడ్డలను గమనిస్తూ బాల్యక్రీడలనుబట్టి భవితవ్యాన్ని నిర్ణయించే

# ★ బిడ్డల భవితవ్యము ★

అవకాశమూ ఆసక్తీ ఉండటము సామాన్యము కాదు. వారు ప్రస్తుతము విద్యాభ్యాసము చేస్తున్న పాఠశాలలుకూడా అంతగా ఉపకరించలేవు.

ప్రతిబిడ్డయొక్క సహజశక్తులు బహిర్గతము కావటానికి మనదేశములో ప్రస్తుతము ఉన్న విద్యావకాశాలు చాలవు. బిడ్డలకు ఆటపాటలద్వారా విద్య గరపుతూ వారి శక్తిసామర్థ్యాలను గ్రహించగలిగిన అధ్యాపకులు అవసరము. దీనికి ప్రస్తుతము మన దేశములో ఉన్న విద్యార్థి. అధ్యాపకుల సంబంధము సహకరించలేదు. ఈ దృష్టితో అనేక విదేశాలను పర్యటించివచ్చిన శ్రీమతి ఇందిరా గాంధి బాల భవనాలను మన దేశములో స్థాపించటానికి కృషి చేస్తున్నది.

బాల భవనాలు పాఠశాలల స్థాన మాక్రమించవు. అవి బిడ్డలకు విద్యావకాశాలను వృద్ధిచేసి, మనోరంజకమయిన వినోదక్రీడలతో వారి నభివృద్ధిపరచేవి. వీటిలో రెండు రకాలు: ఒకదానిలో నాటకాలు, నాట్యము, గానము, చిత్రకళ, స్టాంపుల సమీకరణ మొదలైనవాటికీ; మరొకదానిలో చేతిపనులకూ ప్రాముఖ్యము ఇవ్వబడుతుంది. వీటిద్వారా బిడ్డల అభిరుచులు బహిర్గతము కావటానికి అవకాశము ఏర్పడుతున్నది.

వీటిలో బిడ్డలందరూ పదహారు సంవత్సరాలవరకూ వర్ణ వర్గభేదములేకుండా, కలిమిలేముల ప్రసక్తిలేకుండా కలసిమెలసి అన్నదమ్ములవలె మెలగటానికి తగిన అవకాశాలు ఉంటాయి.

దీనికి ప్రభుత్వపరముగా ఒక బోర్డు నిర్ణయింపబడ్డది. అది కేంద్ర విద్యాశాఖ యాజమాన్యాన నెలకొల్పబడ్డది. మొట్టమొదటిది ఢిల్లీ నగరములో స్థాపింపబడ్డది. బొంబాయి నగరములోకూడా 1955 నాటికే ఒకటి నెలకొల్పబడి కృషి చేస్తున్నది.

"సోవియట్ యూనియన్‌లోను అనేక ఇతర దేశాలలోను బాలభవనాలు నెలకొల్పబడి కృషిచేస్తున్నాయి. కాని స్వీడన్ దేశములోని బాలభవనాలు నాకు చాలా నచ్చాయి. ఆ భవనాలు, వాటి అలంకరణ, సామగ్రి ఫర్నిచరు మొదలైనవి చాలా ఆకర్షణీయముగా ఉన్నాయి. కాని అవి భోగలాలసతను స్పష్టముచేస్తున్నాయి. కాని మనదేశములో బాలభవనాల క్రింద అంత వ్యయము చేయ నవసరములేదు. మనదేశపు శీతోష్ణపరిస్థితులకూ ఆర్థిక పరిస్థితులకూ అనుకూల్యముగా చౌకబారు సామగ్రితో భవనాలను నడుపవలెనని ఉద్దేశ్యము" అని శ్రీమతి ఇందిరాగాంధి పత్రికా విలేఖరులతో చెప్పారు. ఆమె బోర్డుకు ఛైర్‌మన్‌గా నియమింపబడ్డారు."

ఆమె చెప్పినటుగా అక్కడక్కడా బాలభవనాలు స్థాపింపబడి నడుపబడుతున్నాయి. అవి కేవలము ప్రయోగమాత్రముగానే కృషిచేస్తున్నాయి. కాని ప్రస్తుత పరిస్థితులలో మనదేశపు ప్రజలు మ్యూజియమ్ పీసులవలె నెలకొల్పబడిన సంస్థలతో సంతృప్తి చెందలేరు; వారి అవసరాలు అంతటితో తీరవు. ఇటువంటి వనేక సంస్థలు ప్రతి తాలూకాలోనే కాకుండా ప్రతి గ్రామములోనూ నెలకొల్పబడాలి. ఆ ప్రదేశములోని బిడ్డలందరూ వాటిలో చేర్చబడాలి. ఆ భవనాలలో ఆరోగ్యకరమైన వాతావరణము సృష్టింపబడాలి. వాటిలో ఉచిత విద్యావసతి సౌకర్యాలు ప్రతిబిడ్డకూ లభ్యముకావాలి అప్పుడుగాని మనదేశంలో బిడ్డల సహజశక్తులు రాణించడానికి అవకాశాలు లభించవు. ప్రజాభీష్టము రెండవ పంచవర్ష ప్రణాళికలో నెరవేరగలదని దేశము ఆశించుచున్నది. ★

# రాష్ట్రాల పునర్వర్గీకరణ

(7 వ పేజీ తరువాయి)

నిర్వహించడానికి నియమించాలన్నది మరొక సిఫార్సు.

ఇకపోతే, అతి ముఖ్యమైనది పరిసర రాష్ట్రాలలో వుండే అన్య భాషలవారైన అల్పసంఖ్యాకులకు వుండవలసిన ప్రత్యేక రక్షణల సమస్య. ఒక భాషా రాష్ట్రంలో నివసిస్తున్న మరొక మాతృ భాషగల అల్పసంఖ్యాక వర్గాల విషయంలో కేంద్రప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించడం ఎంత అవసరమో వేరే చెప్పవలసిన పనిలేదు. శాసనబద్ధమైన ప్రత్యేకబోర్డు ఏర్పడాలని రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం సిఫార్సుచేసింది. ఈ సిఫార్సును ఉభయ సభల పరిశీలకసంఘం ఆమోదించి నప్పటికీ, వేరొక సలహాకూడా ఇచ్చింది. ఇది సలహామాత్రమే. శాసనబద్ధమైన ఒక ప్రత్యేక అజ్మాయిషీ సంఘాన్ని ఏర్పాటు చేసినందువల్ల ఆయా రాష్ట్రాలలో నివసించే భిన్న భాషల వారి మధ్య వైషమ్యాలు పెరిగే ప్రమాదం వున్నదని పరిశీలక సంఘం అభిప్రాయ పడ్డది. భాషా అల్పసంఖ్యాక వర్గాల రక్షణలకు ప్రత్యేక కేంద్ర ఉద్యోగిని నియమించడం మంచిదని కూడా సూచనప్రాయముగా తెలిపింది. ఇది ఏమంత సబబయిన ప్రతిపాదనగా కనుపించదు.

భాషా అల్పసంఖ్యాకుల విషయంలో వుండవలసిన మినహాయింపులను, ప్రత్యేక రక్షణలను (మాతృభాషలో విద్యాబోధన మొదలయిన వివిధ అంశాలపైనా) రాజ్యాంగం బద్ధమైన సూత్రాల ద్వారా అమలు జరిపించడమే శ్రేయస్కరం. సమగ్రమైన పద్ధతిలో ఆయా రాష్ట్రాల సరిహద్దులను సర్దుబాటు చేయడం ద్వారా భాషా అల్ప సంఖ్యాక వర్గాల సమస్యను వివాదాలను సాధ్యమైనంతవరకు తగ్గించి వేయవచ్చు. గ్రామం ప్రాతిపదికగా భాషారాష్ట్రాల సరిహద్దులు ఏర్పడాలి. అలాగైతే సరిహద్దు వివాదాలు తగ్గిపోతవి. ఇందుకు సరిహద్దు నిర్ణాయక సంఘాలను ఎంత సత్వరంగా ఏర్పాటు చేస్తే అంత మంచిది.

ఆంధ్ర ముఖ్యమంత్రి, తెలంగాణా మంత్రులు శ్రీ చెన్నారెడ్డి, రంగారెడ్డి, హైదరాబాద్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నరసింగరావు ఇటీవల ఢిల్లీలో సమావేశమై తెలంగాణాకు వుండవలసిన ప్రత్యేక రక్షణలపైఒక ఒప్పందానికి రాగలిగారు. ఆంధ్ర ప్రదేశ్‌కు ఒకే కాంగ్రెసు వుండవలెనా, లేక రెండు కాంగ్రెసు సంఘాలు వుండవలెనా అనే విషయంమీద తప్ప, దాదాపు ఇతర అంశాలన్నిటి మీదా ఏకీభావం కుదిరింది. కొత్త మంత్రివర్గంలో ఇప్పటి ఆంధ్ర రాష్ట్రం తరఫున ఆరుగురు సభ్యులువుంటే, తెలంగాణా తరఫున నలుగురు సభ్యులువుండాలనీ, తెలంగాణా ప్రతినిధి ముఖ్యమంత్రి అయితే, ఆంధ్ర జిల్లాల ప్రతినిధి ఉపముఖ్యమంత్రిగా వుండాలనీ, ఆంధ్రజిల్లాల ప్రతినిధి ముఖ్యమంత్రి అయితే, తెలంగాణా ప్రతినిధి ఉపముఖ్యమంత్రి కావాలనీ నిర్ణయించుకోగలిగారు. ఈ నిర్ణయంతో అపోహాలన్నీ తొలగి పోగలవని భావించవచ్చు. ★



Printeo and Published. for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor S. Sambhu Prasad.



కుంభకోణం కుంభేశ్వరాలయ గోపురం

—ఫొటో. ఎస్ రామకృష్ణ


ఆరోగ్యవంతులైన జనులు
ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో
స్నానము చేయుదురు
LIFEBUOY
SOAP
LIFEBUOY
SOAP
LIFEBUOY
SOAP
— అది ప్రతిదిన* మలినములోని క్రిములను కడిగివేయును!
* మనకు ప్రతిదినం తార్సపడే మామూలు
మురికిలో క్రిములున్నాయి మనలో ప్రతి
వారికి యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం
వుంది అందుచేతనే చాలామంది ఆరోగ్య
వంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో
మురికిని మరియు క్రిములను రోజూ కడిగి
వేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును
కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్య
వంతమైన హాయిని కలిగించును
L. 263-X52 TL
భారతదేశంలో తయారుచేయబడినది